# శ్రీమన్మహా రాజాధిరాజ శ్రీజార్జి చక్రవర్తిగారి ప్రశంసనము.

## సీసము.

మహిఁబ్రసిద్ధిగన్న మంత్రులు నొకప్రక్కఁ జక్కని
దేవి యునొక్కప్రక్క । శరణంబ పేక్షించు సామం
తులొకప్రక్క నొగి భటజనులెల్ల నొక్కప్రక్కఁ।
బ్రికటితమౌ మహాప్రతినిధులొకప్రక్క నొజ్జయు
గురువును నొక్కప్రక్క। బహుమోదమునుఁజూపు
బంధువులొకప్రక్క మక్కువగల మిత్రులొక్కప్ర
క్క। నమరసింహాసనాసీనుడైనజార్జి । పాలనంబున
సకలసౌభాగ్యగరిమ । నందిచెన్నొందు హిందూమ
హీజనంబు । కూర్మినాశీర్వదింతముకువలయేశు ॥

## షట్పాద సీసము.

రాజరాజేశ్వర రక్షణంబునగదా హిందుదేశ
ము ఖ్యాతమందగలిగె । సార్వభౌముని రాజ్యసంర

క్షణముగదా దేశభాషకువృద్ధి దెచ్చెనిలను। తులలేని యాంగ్లేయతేజంబునంగదా యంతట వెలసెనీయాంగ్లభాష। ప్రతిలేని యింగ్లీషు ప్రాభవంబునగదా దుష్టులరాయిడి నష్టమయ్యె। పరమవిజ్ఞానుల పాలనంబునగదా వివిధయంత్రాదులు వెలసె భువిని। పాలచునాంగ్లేయ ప్రభుత్వంబునంగదా భరతఖండంబెల్ల బాగుపడియె। గాన నైదవ శ్రీజార్జిఘనునకిలలో సకలసంపత్సుఖమ్ములుసద్యశంబు। సంతతానంద సంతోషసద్గుణములు నాయురారోగ్యములు గల్గియలరుగాత!!

ఇట్లు,

ఆర్య—నారాయణమూర్తి.

# కృతిపతిప్రశంసనము.

---

ఉ॥ శ్రీయుత వైశ్యవంశ ఘనచిత్తుఁడు శాంతుఁడు శీన
యార్యుఁడున్ । న్యాయముగల్గునాతఁడు ననా
రతముం గృహధర్మనీతి సం । ధాయకుఁడా ప్తస
జ్జనుఁడుదారవిచక్షణగల్గునాతఁడున్ । హాయిగ
నుండు పేర్మిగొనియల్లన హిందుపురీవరంబునన్

చ॥ అతులతపఃఫలంబనఁగ నాతనకిం జనియించినట్టి
శ్రీ । యుతుఁడతిధైర్య శౌర్యగుణయుక్తుఁడు ల
క్ష్మణసెట్టిమత్సఖుం । డతికుతకంబుతోడ నను
నారసి పల్కెను మిత్రరత్నమా । క్షితిమత
శాఖలన్నిఁటిని శక్తికొలందిని జేర్చి వేగమే । ధృ
తమతినాటకంబుగను దెల్పుము లోకహితంబు
గ్గోరియున్ ॥

వ॥ అనిసుహృద్భావంబున నన్నుఁ బ్రోత్సాహపఱు
పగా.

ఉ॥ మిత్రునియాజ్ఞగైకొని సమిద్ధత నాటకపఙ్క్తి బూ
నియుం। జిత్రవిచిత్రరీతులను జేఁతలుగల్గువృ
త్తాంతరంబులం। బాత్రలఁగూర్చి గుప్తమ్ములు
భవ్యమనంబులనాటునట్లుగన్। నేత్రము శ్రోత్ర
ముంద నియ నేను రచించితి గ్రంథరాజమున్ ॥

క॥ తాతాలక్ష్మణసెట్టికిఁ। జేతోమోదంబుతోఁడ
జెలఁగుచుదీనిం। బ్రీతిగనర్పణజేసితి। నాతతస
త్కీర్తి సుకృతమగుఁగాతధరన్ ॥

అర్క—నారాయణమూ ,,

హిందూపురం.

आम्

## నాంది.

ఉ. న్యాయుత నిర్వికారత సనాతనతాయత సజ్జనా
ర్తపం । ధాయత సర్వలోకసుఖదాతృత నిర్మల
తాసహాయతన్ । బాయక నుండు నీశ్వరుడు
భావమునందలి మంచికోరికెల్ । త్రోయకొసం
గికర్తను నితాంతము బ్రోచునుగాత సత్కృపన్ ॥

## నమస్కారవృత్తము.

నమో బ్రహ్మ ఓంకార శబ్దాదినామా ।
నమో సర్వరక్షా నమస్తే మహాత్మా ॥
నమో సచ్చిదానంద ప్రః
నమో జ్ఞానదాతా నమస్తే విధాతా ॥
నమో హేవ్యాపకా స్వయంభూభక్తరక్షా
నమో దీనబంధూ నమస్తే సుశీక్షా ॥
నమో శక్తిదాతా పరేశా మహేశా ।
నమో విఘ్ననాశా నమస్తే సురేశా ॥

నమో దేవదేవా నమో ఆదిస్వామీ ।
నమో పూర్ణభావా నమఃపాలయామి ॥

## ఈశ్వరస్తుతి

శంకరాభరణరాగము—ఆటతాళం.

దేవదేవ మహానుభావా (దేవదేవ)
పావనాత్మ పరిపాలయమాం శ్రీ (దేవదేవ)॥
భక్తపాలక జగచ్చరిత పరమేశ్వర- ముక్తిదాయక
సర్వమునిను తమహిమా (దేవదేవ) ॥౧॥
దీన సంరక్షక దివ్యసహాయక- దానవారి ధర్మాధర్మ
విలోకా (దేవదేవ) ॥౨॥
ఆర్తసజ్జనరక్ష అకలంకమునిపక్ష ధూర్తవిపక్ష శ్రీ
మూర్తిసంరక్షా (దేవదేవ) ॥౩॥

బేగడరాగము—రూపకతాళం.

కరుణానిధి వరదా భయహరణా ॥ప॥
నిరుపమాది దేవాద్భుత-నిత్యప్రాభవా-
మరితదూరా-భువనాధార దుష్టసంహారా ॥౧॥
దేవదేవసర్వేశ్వర-దీనపాలనా-

పావనాత్మాపరమపురుష-భక్తవత్సలా ॥౨॥
సార్థకాత్మసన్నుత+సక-లార్థసాధనా-
పార్థితసౌఖ్యార్థదాత-మూర్తిపోషణా ॥3॥

నటుఁడు ప్రవేశించి.

శ్లో॥ హే దేవదేవ కరుణార్ణవదీనబంధో । సృష్టి స్థితిప్రళయకారణభూతశక్తే । దుఃఖార్ణవే నిపతితం జగదేతదద్య। శీఘ్రం సముద్ధర వివర్ధయ సౌఖ్యజాతమ్ ॥

విదూషకుఁడుప్రవేశించి.

చాలుచాలు నీ యీశ్వరస్తుతి నీ మంగళాచరణము! శుద్ధ అసంగతము; అప్రమాణము; నీవు పరిపూర్ణమూర్ఖుడవు. మంగళాచరణమందు యెవరిని స్తుతించితివి? నీ స్తోత్రము ఎవరు వినిరి. ఛీ! కొడలుము; లేనిచో నొక ప్రహారభక్షకుఁడగుదువు. (కొట్టబోవుచున్నాడు.)

నటుడు

నేజేసినయపరాధమేమి? క్షమింపవేడుచున్నాడను.

విదూషకుడు.

నేడిక్కడ వివిధవేష భూషణలచే సుసజ్జితమై విరాజమానమైయుండు, హిందూదేశస్థ మత మతాంతర మండలింజూడక, నోటికి వచ్చినట్లెల్ల వాగుచున్నాడవు. తలయెత్తి నలుదిక్కులు జూడుము. ఈ సభలో త్రిపుండ్రములూర్ధ్వ పుండ్రములు, చక్రాంకితముద్రలు, తిలకములు, గంధములు, అక్షతలు, తెలుపు-నలుపు-యెఱుపు-పసుపు రంగులతో కంపెనీల ట్రేడ్ మార్కులవలె ప్రకాశించుచున్నవి. మరియి తులసి మాలలు-కమలాక్షసరులు-రుద్రాక్షహారములు-భద్రాక్ష వలయములు-స్ఫటికాక్ష మాలికలు-అగుపడుచున్నవి. నీవుచేసిన మంగళాచరణము యీసభకు యోగ్యమైనదా?

నటుడు.

నేను దీనిని మరచినవాడనుకాను. ఈ హిందూ

మండలిం జూచిన నాకొకగొప్పసందేహముకలిగెను. శైవసజ్జనుల మనోవినోదార్థమై శివస్తోత్రముచేసి తినేని, వైష్ణవులుకోపింతురు. వైష్ణవుల ప్రసన్నతార్థమై విష్ణుస్తుతి చేసితినేని శైవులును దేవీభక్తులును క్రోధమును జూపుదురు. దేవీభక్తుల సంతుష్టికై దేవీప్రార్థన చేసితినా++స్వయం బ్రహ్మలగు నద్వైతులు తప్పక నన్ను మర్దింతురు. క్రయిస్తవులు మహమ్మదీయులను సయితము ప్రత్యేకముగా సంతోషపరచవలయును. “సుదుర్లభా సర్వమనోరమాగిరః” నీవైన నాకాలోచన చెప్పకపోతివి. ఇప్పుడేమి చేయుమనెదవు? నీవే చేయుము.

విదూషకుడు.

పాదపవృత్తపాదములు. జలాంబు—ఆదితాళము.

ఏనుగుమోము గణేశునిగొల్తుఁ-
మానుగవాణిని మన్ననసేతుఁ ।
భక్తిని బ్రహ్మను భవుని దలంతుఁ-
శక్తిని సోముని సూర్యుభజింతుఁ ।
అంజలిజేసెద నంజనికొమరుఁ-

రంజితముగ భైరవునికి మొ్రొక్కుచున్ ।
రూఢిగపలు నూరెమ్మలగొల్తున్-
మూఢబుద్ధినై మాధవినిగొలుతున్ ।
అశ్వత్థంబును సమరికగొల్తున్-
అశ్వము నావును అగ్నినిదలతున్ ।
గౌరీ పీరుల గొలుతును మదిలో-
సారెకు యేసును సమ్మతిదలతున్ ।
నీటిని పేడను నిజముగనెంతున్-
చేటను రోటిని సేవజేయుదున్ ।
తేలును పామును దలచెద నెపుడున్-
కాలను బూదిని రోకలి దలతున్ ।
సారెకుజోలెను సన్నుతి జేతున్-
సూరులుమెచ్చగ సర్వముగొలుతున్ ॥

మిత్రుడా! మతమతాంతర ధర్మమునువిడిచి, యేకేశ్వరోపాసనము జేయగూడునా? బహుమంది దిగంబరులలో నొక్కడు లంగోటి ధరించినమొదల వానిగతియేమికావలయును? మిగుల హెచ్చరిక గలిగి యుండవలయును సుమా!

ఝంఝూటిరాగము—ఆటతాళము.

ఆర్యసుపుత్రా అన్నియు మనమిపుడాలోచించుద
మూ । కార్యారంభమునందే నీకును కలిగెను సం
శయమూ ॥ప॥

శాక్త వైష్ణవా శైవభైరవా భక్తులుమాధ్వలునూ ।
ముక్తలింగాగ్రులు క్రయిస్తవజనులచే మురియుచు
నీసభయుకె ॥౧॥

మ్లేచ్ఛులు బౌద్ధులు గాణాపత్యులు మాహేశ్వరజన
ముల్ । స్వేచ్ఛాచారులు సౌరులు జైనులు చూడు
ము కూటమునకె ॥ ౨॥

ఇందరిమెప్పను గోరుట మనకొక తొందరయనుకో
నుమూ । సుందరభారత నందనులందరు బొందెద
రాగ్రహమూ ॥౩॥ మిత్రుడావినము !

చ॥ కొలదికిమీరినట్టిసభగొందరుశాక్తులు వేరువేరు
గకె । కలకలమంచు గూయుచు మకార రుచిం
దలఁచుచుంద్రుతా । మలవడజేసినట్టి పర
మ్మాత్మహరీహర దేవనామముల్ । బలుమరుప
ల్కుచున్న దుటిపట్టెలు పుండ్రములూర్ధ్వనామ

ముల్ | బలుతిలకంబులుꣳ గలిగి భాషలువేషు.
ములిందుజూడుమీ ||

సఖా దృశ్యమపూర్వమైయున్నదిగదా?

నటుడు.

మిత్రమా! ఈ జనసముదాయము తమ్ము దృశ్యమని దెలియుచుండలేదు. ఏదియో నొకవేడుకను జూచుట కుత్సుకులైవచ్చిన దర్శకసంఘమని భావించియున్నవారు.

విదూషకుడు.

నెచ్చెలీ! వీరందరు పరస్పర విరోధులాలేక మిత్రులా? నీకెట్లు తోచుచున్నది?

నటుడు.

భలా! నాకుమంచిజ్ఞాపకము చేసితివి. దీనిని సభవారికి జూపుటకయ్యే నేనాలోచించుచుంటిని. ఇకనాపనికై నేవెళ్లుచున్నాను. (ప్రస్థానము)

---

(భారతమహారాజును మంత్రి విద్యాలంకారుడును)
(ప్రవేశము.)

రాజు.

సేవకా! మతాంతరమహాజనులందరు వచ్చియున్న వారా? వచ్చియుండువారిని వివరించిచెప్పుము.

సేవకుడు.

మహాప్రభూ! హాజరుండువారిలో చార్వాకులు-సౌగతులు-ఏకదేశికులు-జైనులు - బౌద్ధులు-అర్హాతులు-క్షపణకులు-శాక్తేయులు-మీమాంసులు-పాంచరాత్రులు-ఆయకులు- వైశేషికులు- సాంఖ్యులు-పాతంజలులు- పాశుపతులు- కాపాలికుల - మాంత్రికులు- శైవులు- వైష్ణవులు- గాణాపత్యులు-ద్వైతులు- అద్వైతులు - విశిష్టాద్వైతులు - అనంతాద్వైతులు- వేదాంతులు- రసాయనికులు- యోగులు-న్యాయవైశేషికులు- భాట్టప్రభాకరులు-భాస్కరులు- మహమ్మదీయులు- క్రైస్తవులు- పారసీలు-

సీక్కులు మొదలగు హిందూదేశమందుగల మ
తాంతరులందరు వచ్చియున్నవారు.

రాజు.

మంత్రిపుంగవా! మనదేశమున నెన్నిమత
ములుగలవు?

మంత్రి.

ప్రభూ! దాదాపు ఆరునూరుల మతములుగలవు;
గాని అనేకములొక్క ముఖ్యమైన మతమునుండి
భిన్నములుగానున్నవి. ఉదాహరణముగా వైష్ణ
వములో- మాధ్వ- రామానుజ- వడగల- తెంగల
వైఖానస- వల్లభ- భాగవత- బైరాగి మొదలగు
శాఖలుగలవు. ఈలాగున శాఖ ప్రశాఖలు ప్రబ
లియున్నవి.

రాజు

విద్యాలంకారా! ఏమి! ఈజగత్తు యథార్థముగా
దుఃఖరూపముగా నుండలేదా? యెవడుగాని దుఃఖ

మను ముల్లుతోడ గ్రుచ్చబడకపోయినట్లు అగుపడ
దుగదా? దుఃఖసముద్రమందు మునిగి స్నానము
చేయనివాడెవడు? నేను మహారాజునైయుండియు
నాకును రోగాదిదుఃఖంబులును ప్రేమాబద్ధులగు
వారి మరణంబులవలనగలగు సంకటంబులును గలి
గియున్నవి. నీయభిప్రాయ మేమి?

మంత్రి.

అట్లనగూడదు. ఒకడు కల్లుత్రాగి కష్టముచుండి
గట్టెక్కితినని యానందించును. ఒకడు కామవ
శుడై స్త్రీలతోగూడుట సుఖముగా భావించుచు
న్నాడు. అనేకులు మృష్టాన్నములుతిని సుఖవం
తు లనుకొనుచున్నారు. కొందరు శృంగారపురుషు
లు అలంకారములు చేసికొని అనందించుచున్నారు.
సర్వులును ధనమునుకూడబెట్టి సుఖవంతు లనుకొం
దురు. గనుక కొంతవరకు సుఖమునుగలదు. లేద
నకూడదు.

శాక్తేయుడు. (నిలువంబడి)
మహాప్రభూ! మంత్రిగారు మొదటచెప్పినదానిలో

నాకు సానుభవము. మాశాక్తేయ మతములో దుఃఖమేలేదు. తిని త్రాగడములో భోగమున్న ఆనందములో మోక్షమున్న రెండునుగలవు. మాయానందములో బ్రహ్మము తాండవమాడుచుండును. జలదారి కాలువులోగూడ మేము నిశ్శబ్దముగ నిద్రవోయెదము. ఎన్ని చన్నీళ్లకడవలతో అభిషేకము చేసినప్పటికిన్ని మాయానందము దిగేదికష్టము. ఆయానందములో అక్కచెల్లెండ్రనుగూడ ఆలింగనముచేసికొందము. ఇప్పుడుకూడ ఆనందములోనేయున్నాము.

శంకరాభరణం. త్రిపుటి.

యేమానిదెల్పుదునానందం— ఓ— భూమీశవిను సురాపానందం ॥

ధరణి గిరిగిర దిరుగు నానందం—మంచి— మెరుపుకన్నుల కెక్కునానందం । బురదలోబడినట్టియానందం—అట్టె—చరచర బేదులయానందం ॥౧॥

ఎంతోవింతలుగలయానందం-మంచి-వాంతులు గల్గెడియానందం । కంత జోలిలోమోయునానం

దం-కల్లు-ముంతలోపుట్టినయానందం ॥౨॥

వైరాగ్యయుతమైనయానందం-సదా- దారాపు
త్రిల బిత్తలానందం। ఘోర దురాచారమానం
దం-మంచి-సారముతేలకెక్కుయానందం ॥౩॥

మహారాజా! ఈ దేవతాయానందం- యీకల్లె
మ్మవారి పాదతీర్థప్రభావము- అనుభవించువారికే
తెలియకుండగా దానిని వర్ణించువారవరు? మీా
రుదుఃఖనివృత్తికోరదరేని తప్పక శాక్తేయమునకు
శరణాగతులుకావలయును.

రాజు.

మంచిది మీావంతు వచ్చువరకును మౌనముగ
నుండవలేను. మంత్రివరా! ఇట్టి యచిరస్థాయి
యగు సంతోషమందల్పకాలము మగ్నులై మేము
సుఖవంతులము- మేముప్రసన్నులము- మాకానంద
మనుకొని యున్మత్తునివలె ప్రతిక్షణము నుపస్థితమై
యుండు దుఃఖమునుమరచి, భ్రమించుచున్నవారు.
నేను బాల్యమందు యువావస్థను దలచుకొని ఆనం
దించితిని. యవ్వనము ప్రాప్తించగా- హా- నా

బాల్యము పోయెనేయని దుఃఖముకలిగినది. దరిద్రు డు దారిద్ర సంకెళ్లతో బంధింపబడి పంజరమందలి వ్యాఘ్రమువలె- బొబ్బరించుచుండును. ధనవంతు డు-తానెక్కడ దరిద్రుడగుదునోయనుభీతిచే, కాల్ప నికసుఖమనుభవించుచున్నాడు. ఇప్పుడు మీయ భిప్రాయమేమి?

రేగుప్తి.

ఏమిజేయవలెనో-ముందేమిగాబోయెదనో-ఇపు డేమిజేయవలెనో ||ప||

దేహధారణకై దారియుతోచక భూమిని అన్న ము భిక్షమువేడితి-ఈమహాన స్త్రీముల్ మొక్కలనడి గితి-అహా! దీనికినెంతగర్వించితి ||౧||

ఉత్తమలోహముల్ పృథ్విలోవీసితి। మెత్తనిశా లువుల్ మేకలనడిగితి। మొత్తముధనములు మెం డుగనాయెను।చిత్తము శాంతము జెందకయున్నది॥

స్వాదముల్ మోదముల్। సుందరగృహముల్- ఈదివ్యాంబరాభరణంబుల్। ఆవిగానన్నియు నడిగితి భిక్షము-యేదియు నాయది గాదని దెలిసితి ||3||

పశులువృక్షముల్ పశువులు పురుగులు। మక్షి
కంబులును మలలును లతలుగ । భిక్షములివ్వగ-
బిడియములేకను-దక్షుడనేనని దంభముజేసితి ॥౪॥

తిన్న యన్నముగాని- ఉన్న దేహముగాని- కన్న
వారలుగాని- యెన్నటికైనగ। మన్నులోగలియక క
న్నులజూచుచు-నున్న వాడనునే నిన్ని దినంబులు॥౫॥

మంత్రివర్యా ! యేసార్వభౌముడైనను నిత్యసు
ఖమును గలిగియున్న వాడాయని ప్రపంచ పరిక్షచేసి
చూచినయెడల ప్రతివానికి- స్త్రీసంబంధమో సం
తాన సంబంధమో- ధన సంబంధమో- వ్యవహార
సంబంధమో - ప్రజాసంబంధమో- రాజ్యసంబంధ
మో- రోగసంబంధమో - యేదియోనొకటి ప్రతి
వానిని దుఃఖింపజేయుచున్నది. ఈ దుఃఖశోకము
నుండి విడుదలపొందుటకు మార్గము యేమతమం
దున్నది? ఈ దుఃఖ సంకెళ్లనుతీసి పారవేయునట్టి
పవిత్రమ్మార్గమేది? అట్టి ధర్మమెచ్చటనున్నది? నిత్య
శాంతికైయేమియు విధులులేవా? ఓ సభ్యులారా!
నాయనుమానమాయిను లెవరైన మీలోగలరా?

ధర్మపాలుడు. (సభనుండి లేచినిలిచి)

రాజేంద్రా! నాకెన్నినాళ్లనుండియో కామక్రోధాది మానసిక సంతాపములచే చిత్తము ప్రతిక్షణముత్థాపిత మగుచుండును. స్వప్నమందును దుఃఖమే ప్రతీతమగుచున్నది. ఈ దుఃఖమునుండి ముక్తుడగుటకై త్రాణను సంపాదించుకొనవలయునని దేశసంచారినై, యీ మహా మతమతాంతరసభకు వచ్చితిని. నేను సత్యప్రియుడను, సత్యాన్వేషకుడను, సత్యమెచ్చటనున్న గ్రహించెదను. సత్యమేనాకు ప్రియతమము. నాకు సత్యాభిమానమువినా మరే యభిమానమును లేదు. ఇన్నిమతమతాంతరములలో యథార్థమెచ్చటగలదో? నిశ్చయించుట మహా దుస్తరముగానున్నది.

రాజు.

నా ధర్మభ్రాత్రుడగు ధర్మపాలా! ఇటువచ్చి నాప్రక్కన గూర్చుండుము. మంత్రిశేఖరా! ఈ సభాసదులకు మన విజ్ఞాపనపత్రికను చదివి వినిపించుడు.

మంత్రి. (చదువుచున్నాడు)

సభ్యమహాశయులారా! లోకములో నిప్పుడు యీశ్వరీయ జ్ఞానమనేక భిన్నభిన్న సాంప్రదాయములతో నిండిపోయినది. కొందరు తామే యీశ్వరులని యెంచుచు ప్రపంచము శూన్యమనియు కొందరు పుణ్యమునకొక దేవతయు పాపమునకొక దేవతయుగలరనియు, మరికొందరు సృష్టికర్తయొకడు పాలనకర్తయొకడు ప్రళయకర్తయొకడు ముగ్గురుగలరనియు, వేరు కొందరు ముప్పదిమూడుకోట్ల దేవతలుగలరనియు, కొందరు దేవుడనేకయవతారములెత్తుననియు చెప్పుచున్నారు. కొందరు గోరీలను, సమాధులను, స్మశానములను, మృగములు, పక్షులు, కొండలు, నదులు, నీరు, పాములు, తేళ్లు, పుస్తకములు, పటములు, విగ్రహములు, పేడయుంటలు మొదలగువానిని పూజించిన స్వర్గప్రాప్తియనియు, కొందరాకాశమున దేవుడు స్వర్గమును నిర్మించుకొనియున్నాడనియు, దేవునియందుమరపు, అజ్ఞానము, అత్యాచారము, హింస,

శోకము, భయము, మొదలగు గుణములుగలవ
నియు, కొందరు భూతప్రేత పిశాచములు మానవు
లకు కీడు మేలులు నిచ్చుననియు, ఈశ్వరుడు మను
ష్యులందు ఆవేశించి ఫలాఫలముల నిచ్చుననియు,
కొందరు తత్వములు వానియధి దేవతలుమాత్రము
గలరనియు, కొందరు స్త్రీపురుషుల మర్మాంగములను
పూజించిన ముక్తియనియు, కొందరు జంతువుల
జంపి వాని మాంసముతిని మద్యముద్రాగినయెడల
దేవునికి ప్రీతియనియు, కొందరీశ్వరీయజ్ఞానము వే
దములలో గలదనియు, మరికొందరు బైబిలులో
గలదనియు, వేరుకొందరు ఖురానులో గలదనియు,
వేరుకొందరు మరికొన్ని గ్రంథములలో గలదనియు,
కొందరు గ్రంథములనావశ్యములనియు, కొందరు
దేవుడెల్లప్పుడు పాప పుణ్య విచారణజేయునని
యు, మరికొందరు ప్రళయాంతమునందే చేయున
నియు, కొందరు జాతి పుట్టుకతో వచ్చెనని, కొంద
రు గుణకర్మస్వభావమని, కొందరు జన్మముగలదని
కొందరు లేదని, కొందరు దేవునికి పూజలు నైవే
ద్యములు బలులు చేసిన పుణ్యమనియు, కొందరు

నామములు, మరికొందరు వీభూతియు, లింగము, కొందరు గంధము, కొందరు శంఖుచక్రముద్రలు, పాపములుపోగొట్టి ముక్తినిచ్చుననియు, కొందరు కర్మఫలముతప్పక యనుభవించవలెననియు, కొందరు గ్రహములు ఫలముల నిచ్చుననియు, కొందరు మానవులకు సుఖదుఃఖములు స్వాభావములనియు, దేవుడులేడని కొందరును, కొందరుసాకారుడనియు, మరికొందరు నిరాకారుడనియు, సగుణుడని, నిర్గుణుడని, సగుణనిర్గుణుడని, యిత్యాద్యనేక విధములుగలవు. ఇందులో యథార్థజ్ఞానమేది? అని నిర్ధరించుటకై యీసభ యేర్పరుపబడినది. మీమీ మతపక్షమవలంబించి వాదించువారు సభలోనుండవలయును. సత్యపక్షమువలంబించి వాదించువారు రాజుగారిపక్షమునవచ్చి కూర్చుండవలయును. ఇతి విజ్ఞప్తి.

రాజు.

సభాసదులారా! సత్యము నిర్భయమైనది. మా ఖండనకు భయపడుదురేని మీయందు సత్యములే

దని తీర్మానమగును. ఏమతమందు సత్యములేదో ఆమతమువారు ఖండనకు భయపడుదురు. మంచి బంగారు అగ్నికి వెఱచునా? ఆలాగున మీమత ములందు సత్యమున్నచో సమీక్షులకు జడియకూ డదు. అట్టి భయముగలవారు సభను విడిచి లేచి పోవచ్చును. మేముచేయు ఖండనలో అసత్యమెం తమాత్రముండదు. ఆధారములేకుండ సంగతులు చెప్పము. యేమతమునుగాని వ్యర్థముగ నిందిం చుట మాపనిగాదు. దేనియందుగాని సత్యమున్న గ్రహింతుము. అసత్యము అగ్రాహ్యము, మూర్ఖ ము, అసంభవము, పక్షపాతము, స్వార్థము, ప్రకృ తివిరుద్ధములతోగూడియున్న వానిని సమీక్షచే యుదుము. ఇప్పుడద్వైతులవరైన ప్రసంగమా రంభము చేయువలయును.

బ్రహ్మంగారు.

పాట. శంకరాభరణం.

రా రేపోదాము మావూరు—సుఖ—సారముబిచ్చు నుమాయూరు । చేరినవారికిమావూరు— మంచి—

దారినిచూపునుమాయూరు ||

అందరుండునదిమాయూరు— మరి—యందరో తె
లియరుమాయూరు | సందులులేనిదిమాయూరు—
ని—స్సందేహమైనది మాయూరు ||౧||

రోతలులేనిది మాయూరు- విశ్వ— నాధనివాస
ము మాయూరు || చేతోమోదము మాయూరు—
యమ--దూతలతరుమును మాయూరు ||౨||

శిక్షలులేనిది మాయూరు—బహు—లక్షణమైనది
మాయూరు | సాక్షికిమీరిన మాయూరు—యీ—
కుక్షిలోగలదది మాయూరు ||౩||

భిన్నములణచును మాయూరు-బహు-వన్నెలు
లేనిది మాయూరు | కన్నులచోద్యము మాయూ
రు-సుర- కిన్నరులెరుగరు మాయూరు ||౪||

ధీరులుండునది మాయూరు - సుఖ- సారముగల
దది మాయూరు | పారములేనిది మాయూరు-నిజ-
శూరత్వమైనది మాయూరు ||౫||

సంకటములులేని మాయూరు—ఆ - టంకరహిత
మదది మాయూరు | సుంకములేనిది మాయూరు.
ని-శ్శంకలనిలయము మాయూరు ||౬||

ధైర్యముగలదది మాయూరు- కృత - కార్యసం
పన్నముమాయూరు । ఆప్యులకెల్లను మాయూరు
ఔదార్యముజూపును మాయూరు ॥౭॥

రాజా! ఈసంసారము మిథ్యాస్వప్నమువంటిది. దీనికి కర్త యొకడులేడు. అనుభవించువాడునులేడు. పరమేశ్వరుడు అన్నిటిలోను తానే క్రీడించుచున్నాడు. నరకస్వర్గము-లుగాని, పాపపుణ్యములుగాని, ధర్మాధర్మములుగాని, సుఖదుఃఖములుగాని లేవు. అజ్ఞానముచేత యీభ్రిమ గలిగియున్నది. జ్ఞానము కలిగినతక్షణమే, బ్రహ్మమగుచున్నాడు. జీవభావముకల్పితమైనది. జీవుడే బ్రహ్మము. బ్రహ్మమే జీవుడు. ఇందులో భేదమేమియులేదు. ఈ సిద్ధాంతము శ్రీయాది శంకరులు స్థాపించినారు.

ధర్మపాలుడు.

ఒకడు వ్యభిచారాదికుకర్మలు చేసినయెడల స్మృతులలోశిక్ష లెందుక-విధించిరి? న్యాయాధీశులు శిక్షచేయడమెందుకు? శిక్ష అనుభవించువాడెవడు? ప్రిపంచము మిథ్యయైనయెడల ప్రపంచములోగల బ్రిహ్మము మిథ్యకాదా?

అద్వైత బ్రహ్మముగారు.

ఇట్లు తలంచుట అజ్ఞానము. "బ్రహ్మోహమస్మి" అని యెవడునమ్ముచున్నాడో వాడుముక్తుడు. పాపముచేయువాడెవడు? శిక్ష ననుభవించువాడెవడు? అంతయు మిథ్య. సర్వము బ్రహ్మము. "నపాపం నశిక్షా శివః కేవలోహం" సుఖ దుఃఖములు శరీరమునకేగాని ఆత్మకులేవు.

ధర్మపాలుడు.

శవమునుకాల్చునప్పుడది దుఃఖపడునా? లేదుగదా గనుక సుఖదుఃఖములు శరీరమునకని యెట్లు చెప్పుదురు? బ్రహ్మకు అజ్ఞానమెందుకు కలుగవలెను. బ్రహ్మ అజ్ఞానుడా? ఇప్పుడు నాబలముకొలది మీకు ముఖ చపేటములు సమర్పించుచున్నాను. ఆదెబ్బల దుఃఖము తామనుభవించ కుండనుండవలయును.

(బ్రహ్మముగారు దూరముతొలగు చున్నారు.)

---

విద్యాలంకారుడు.

బ్రహ్మముగారు దూరమెందుకుతొలగుచున్నా రు? మీసిద్ధాంతములు మీరుస్థాపనచేయవలెను. మీకు స్వానుభవమైనట్టి మంచి యుదాహరణముల నిచ్చి అద్వైతమునుస్థాపించి ఆదిశంకరులకు కీర్తి ని సంపాదించవలయును. అట్లు చేయకపోయెదరేని అద్వైతము శంకరులు స్థాపించిరని చెప్పుటకాధా రములేదు.

బ్రహ్మముగారు.

దివ్యమైన యుదాహరణ నిన్ననే జరిగినది. శ్రద్ధ తో వినవలయును. మా బ్రహ్మపురములో బ్రహ్మ లసమారాధనము జరిగెను. బ్రహ్మలు కొందరు జలబ్రహ్మము దెచ్చిరి. ప్రొయ్యి బ్రహ్మలను బెట్టిరి. అగ్నిబ్రహ్మను మండజేసిరి. పాత్రబ్రహ్మ లలో తండులబ్రహ్మలను బోసి అన్నబ్రహ్మమును వండిరి. బ్రహ్మలందరు తటాక బ్రహ్మములోమునిగి వస్త్రబ్రహ్మలను ధరించి వచ్చిరి. వెంటనే పత్రబ్ర హ్మలను వేసిరి. పదార్థ బ్రహ్మలను వడ్డించిరి.

బ్రహ్మభోజనము ముగిసినది. తాంబూలబ్రహ్మ ను సేవించిరి. ఇంతలో నొక చోరబ్రహ్మము, రామబ్రహ్మముయొక్క మూటబ్రహ్మమును మోసెను. రామబ్రహ్మము తన మూటబ్రహ్మను గానక, వాగ్బ్రహ్మముతో హస్తబ్రహ్మను జేర్చి శబ్ద బ్రహ్మమును జేసెను. బ్రహ్మలు కొందరు దండ బ్రహ్మలను బుచ్చుకొని మార్గ బ్రహ్మమున పరువెత్తిపోయి చోర బ్రహ్మము నెత్తిపైన, దండ బ్రహ్మలతో ప్రహార బ్రహ్మలను ప్రయోగించిరి. చోరబ్రహ్మముయొక్క శిర బ్రహ్మము పగిలి రక్త బ్రహ్మమ్మై పతన బ్రహ్మమాయెను. మాగురు బ్రహ్మముగారు దిగ్భ్రమముజెంది పంక బ్రహ్మము లోబడి పరబ్రహ్మము జేరిరి. ఇది ప్రభు బ్రహ్మకు దెలిసెను. పోలీసు బ్రహ్మలు వచ్చిరి. వచ్చి బ్రహ్మలనందరిని లాకపు బ్రహ్మములో వేసిరి. అధికార బ్రహ్మముగారు లంచ బ్రహ్మను బుచ్చుకొని అందరిని ముక్త బ్రహ్మల జేసెను.

ధర్మపాలుడు.

బ్రహ్మవేదములో బ్రహ్మాధ్యాయములో బ్రహ్మ ఘట్టములో స్వయం బ్రహ్మలందరు నరక బ్రహ్మము లో నైక్యమగుదురని చెప్పియుండునుగదా? మం చిది రండబ్రహ్మలతో గురుబ్రహ్మలు గూడవచ్చు నా?

బ్రహ్మముగారు.

ఇందుకు బ్రహ్మగీతలు ప్రమాణముగానున్నవి. పూర్వమర్జునుడు కృష్ణునిజూచి "అనాథబాలరం డానాంకాగతిః పురుషోత్తమ" యని యడుగగా అందుకు కృష్ణులు "అహమద్వైతరూపేణ విష యస్యామిపార్థివ" అని సెలవిచ్చియున్నారు.

విదూషకుడు.

సభ్యులారా! మాబ్రహ్మముగారి సిద్ధాంతము నకు పబలముగాను ప్రమాణముగాను నేనొక బ్రహ్మగీతమును పాడుచున్నాను.

పాట. శహనా.

అంతా బ్రహ్మమురా జగమంతా బ్రహ్మమురా ॥
అంతా బ్రహ్మము యింతా బ్రహ్మము వెం
తో బ్రహ్మము వింత బ్రహ్మము ॥ప॥

సంత బ్రహ్మములో—సు—రాంతబ్రహ్మమువర్గ—
ముంత బ్రహ్మను ముంచియు నింపుగ గొంతు బ్ర
హ్మము గ్రోలుచునుండగ ॥౧॥

మేక బ్రహ్మము—లో వాగెడు—కేక బ్రహ్మము
రా—మేకబ్రహ్మను కాక బ్రహ్మలో—పాక బ్రహ్మ
ము జేసి భుజించిన ॥౨॥

పరుండు బ్రహ్మముపై—తూలుచు—పైబడు బ్రహ్మ
మురా—గిరగిర బ్రహ్మము గీతబ్రహ్మము పొరలెడు
బ్రహ్మము పాడెడు బ్రహ్మము ॥౩॥

ఎక్కెడు బ్రహ్మమురా—నాట్యము—ద్రొక్కెడు
బ్రహ్మమురా—ఉక్కిరి బిక్కిరి యూపిరి బ్రహ్మము—
ప్రక్కల నొక్కుచు కక్కెడు బ్రహ్మము ॥౪॥

తోపు బ్రహ్మములో— కూడిన - పాప — బ్రహ్మ

లురా। కూప బ్రహ్మములోపల నుండిన చేపబ్రహ్మల
బట్టి భుజించిన ॥౫॥

బ్రహ్మముగారికి రండా బ్రహ్మశిష్యులు మెండుగా నుండినట్లు దోచుచున్నది. అవునుగదా?

బ్రహ్మముగారు.

మాకును మాశిష్యులకును అభేదము. వారి సుఖమే మాసుఖము. మాసుఖమే వారిసుఖము. వారే మేము—మేమే వారు. మాకభేదస్వానుభవమువలన నానందము కల్గును. మీయింట రండబ్రహ్మలుండినయెడల మా గురుకుల యేకాంత సేవకు రావచ్చును.

విదూషకుడు.

మా రండబ్రహ్మలకు కేశబ్రహ్మలను తీయించి ముండ బ్రహ్మలజేసి ముక్తిలో గలపినారము. తాము త్రాడుదెగిన గొడ్డుయెనుములకు ఆనందము కలుగజేయు దొడ్డవారు.

## ధర్మపాలుడు.

సభ్యులారా! బ్రహ్మముగారు బోధించిన అద్వైతమునుగురించి నాకు కొన్ని శంకలుగలుగుచున్నవి. వినుడు!

పాట. ఝంఝూటి.

తా దేవుఁడైనచో భేదమెచ్చట బుట్టె దెల్పరయ్యా!
ఆ దేవునందా-యీ దేహాంతర్గతమందా దెల్పరయ్యా!
జీవునియందన్న దేవుఁడెవ్వఁడుమరి—దెల్పరయ్యా!
దేవునియందన్న జీవుఁడెవ్వఁడుమరి—దెల్పరయ్యా! 1
దేవుఁడు భిన్నుఁడై దేహాలందుండునా? దెల్పరయ్యా!
దేవుఁడజ్ఞానియై దుఃఖము బొందునా? దెల్పరయ్యా!
తా దేవుఁడైన నీవేదములెవరికి? దెల్పరయ్యా!
బోధలువిద్యలుయీదుఃఖమెవరికో? దెల్పరయ్యా! 3
తానే బ్రహ్మనని దెలియువాఁడెవ్వఁడు? దెల్పరయ్యా!
గానంబడునది గాంచుటవేరొకటి గాదేమయ్యా! 4
బ్రహ్మను బ్రహ్మమెగాంచెననదరేమో? దెల్పరయ్యా!
బ్రహ్మలెందరు యీమర్మములిప్పుడు దెల్పరయ్యా! 5

న్యాయాధిపతిబ్రహ్మనేరస్థుడొకబ్రహ్మ దెల్పరయ్యా!
న్యాయ మన్యాయములొక్కటి యగునేమో దెల్ప
రయ్యా! 6

ఒకడేడ్చుచుండు వేరొకడేడ్చుచుండుటను జూడరయ్యా!
సకలేశ్వరునకిట్టి వికటములేమిటో దెల్పరయ్యా! 7
శివుడైనతనకు నీశవదేహమెట్టులబ్బె దెల్పరయ్యా!
భవబంధములజిక్కి బాధలెవడుపొందు దెల్పరయ్యా!
అన్నికల్లలెయన్న మీపలుకుకల్లయ్యె దెలియర
య్యా!

ఉన్నదియన్న మీరన్నదికల్లయ్యె దెలియరయ్యా!
అద్వితీయుడన నద్వైతమయ్యెను దెలియరయ్యా!
చిద్విలాసుడు కర్మబద్ధుడుగాడని దెలియరయ్యా!
మిథ్యామార్గమునీగిసత్యముమనసున దెలియరయ్యా!
తథ్యము వైదికధర్మంబులెల్లను దెలియరయ్యా! 11

సభికులారా! ఈ వేదాంతులు సర్వము బ్రహ్మ
మనుదానియొక్క సత్యార్థము దెలియరు. చింత
లేదు. తాము చెప్పినట్లుగా—నీ స్వయంబ్రహ్మలు,
చండాలులగు బ్రహ్మలయిండ్లలో యేల భుజింప

రాదు? అందరు బ్రహ్మమువారికి, వావివరుస లెందుకు? తామనుభవించునదంతయు అజ్ఞానము అనుచున్నారుగనుక, వీరు నరకమున బడినను ముక్తియనుకొందురు కాబోలు? ఈ మానవబ్రహ్మలు వ్యాఘ్రబ్రహ్మను జూచిన, పరువెత్తుదురు. సర్పబ్రహ్మలను పట్టుకొనజాలరు. ఈ వేదాంతమునంతము జేసి వెరొకయంశమునకు మరలుదము. ఈశ్వరుడజ్ఞానియనెడు నీయద్వైతము సమంజసముగా నుండలేదు.

రాజు.

అద్వైతమనగా రెండవదిలేనిది అర్థాత్ అద్వితీయమైనదని అర్థము. అది ఈశ్వరీయజ్ఞానమైయున్నది. జీవుడే దేవుడనెడు యిట్టినాస్తిక మతమునకు అద్వైతమని పేరుపెట్టుటమిక్కిలి యనుచితమని నాయభిప్రాయము. మరియు దీనిని శంకరాచార్యులు స్థాపించిరనుట నేను నమ్మజాలను. వారు అనేక ఈశ్వర స్తోత్రములనుచేసి యున్నారు;

గాన వారి పేరిట పరులు కల్పించి యుండవచ్చునని నాయాశయము. ప్రత్యక్ష ప్రపంచమును మిథ్య యనుట శుద్ధయవివేకము. వీరు రజ్జుసర్పభ్రాంతిని, యుదహరింతురుగాని, సర్పము అవస్తువుగాదను జ్ఞానము వీరికిలేదు. జలమును అగ్నియు, వైధర్మ్యములుగలవి. ఇవిరెండును బ్రహ్మమేయనుచున్నారు. దర్శన శాస్త్రజ్ఞులైన శంకరులిట్లు శాస్త్రవిరోధవాదమెప్పటికిని జేసియుండరు. ఆకాశమంతటనిండియున్నదిగాని, సర్వము ఆకాశమెట్లగును? బ్రహ్మకు అజ్ఞానమేల కలుగవలయునన్న వీరు ప్రత్యుత్తరమును సరిగానివ్వరు. ఈ మతము కేవలము వేదవిరోధము. శంకరులన్ననో శుద్ధ వైదికులుగాన, దీనిని శంకరమతమని చెప్పుట అసంగతము. శంకరులారు మతములను స్థాపించిరను ప్రతీతిగలదు. ఒక మనుష్యుడెట్లు ఆరుమతములు పరస్పర విరోధములగువానిని స్థాపించును? విరోధము లేదన్న నొక్కటిగానుండక, యారుగా నెందుకుండవలయును? ఆయామతస్థాపకులు ప్రత్యేకముగ నుండగా, వీరుస్థాపించిరనుట నిజమెట్లగును.

గాన నాథునికుప్రీతిగా వారిపై యీదోషమును మోపియున్నవారు. పదిమైళ్లు నడచినచో ప్రాలు మాలునట్టి జీవుడు పరబ్రహ్మమని చెప్పువాడు పిచ్చి వాడుగా నుండవలయును. ఇంక నీసంగతిని చాలించుదము. మహమ్మదు మతస్థులు ప్రసంగము జేయనచ్చును.

మౌల్వీకాశీం సాహిబ్.

గజల్.

భగవాన్ అబ తుమకో ఖాసా భరోసాహై-
భటక దునియామే హమ్ సారా ఫిరాహై ॥ప॥

నహైం వినాభగవాన్-కోయీసహాయకమురీఖ-
కహాంసుఖసంపద-వినా తేరే పితాజీ ॥౧॥

యహ జగత్ సారా-దుఃఖోంసే భరాహై-
హే భగవాన్ తేరే చరణోంమే పడాహై ॥౨॥

నక్షత్రు తేరా-కోయీ-జగతమేహై-
తేరీ సారీ దునియా సహీ సూఝతీహై ॥౩॥

సభీ సుఖమిలేహౌ గుజారా తుమారా-

హౌ-సబ్ దుఃఖసే జగమే ఉభారా తుమారా॥౪॥

పాట. జలాబు.

ఈశ్వరతూహై పితాహమారా- రచాతుహీనే సబసంసారా ॥

దీనోంకాప్రతి పాలకహైతూ దుష్టజనోంకా ఘాలకహైతూ ॥౧॥

ఏకతుహీహై సచ్చాసాయీ -నహీందూసరా తేరీనాయీ ॥౨॥

తేరాయేక భరోసా సచ్చా - ఔరభరోసా సబకా కచ్చా ॥౩॥

పతఝుడమేతూ పత్తేఝూరై - ఫిరవసంతమేన యేనికారై ॥౪॥

ఖానపాన జిసకాహై జైసా - పహుంచాతాహై ఉసకోవైసా ॥౫॥

గజకీ గరదనలఘుదరసాయీ - తోం-తూలంబీ సూండలగాయీ ॥౬॥

బాఘోంసే రత్నాకరనేకో - ధావనశక్తిదియా
హిరనేకో ॥౭॥

జైజై బోలో జగతపితాకీ - త్రిభువనకేకర్తా
ధర్తాకీ ॥౮॥

ప్యారే నాజరీణ్! సభ్యజనో!! మిమ్మలనంద
రినీ నేను ప్రార్థించుచున్నాను. ఇది మతమతాం
తర మహా సభగానున్నది. అయినను మీలో
నెన్ని భేదములుండినను హిందువులని యొక్క పే
రున పిలువ బడుచున్నారు. మహమ్మదీయులు
మీకు నన్ని విషయములలోను భిన్నులైయున్న
వారు. ఎవరుగాని మతము విషయములో తమ
మతము శ్రేష్ఠమని చెప్పుకొనునప్పుడు, యితర
మతములలో నిలోపములను గురించి చెప్పవలసి
యుండును. గనుక శాంతమును మనమందరమువ
హించ వలయును. మన మిక్కడ నాదించి సత్య
మును స్వీకరించుటకై చేరియున్నాము-గాని కల
హించుటకుగాదు. సభాపతులగు మహారాజుగా
రును హిందువులుగా నున్నారు గనుక వేడు
చున్నాను.

రాజు.

ఓ మాల్యేసహోదరా! నే నీసభలో రాజుగా నుండలేదని గ్రహించుము. అందరిలో నేనొక్క డుగానున్నాడను. ఏమతస్థులుగాని యెవరుగాని, తమ లోపములు, తిద్దుకొనకపోయినయెడల, వారికిశుభము లేదు. ఆంగ్లేయ విద్వాంసుడగు జాన్ సన్ దొరగారు " ఎవరుగాని నిజమైనతప్పును నీయందుజూపినప్పుడు నీకు సిగ్గుకలుగవచ్చును. పదినీకు సిగ్గునుకలిగించెనో దానిని విడిచిపెట్టుము " అని చెప్పినారు. గనుక మనమందరును సహోదర భావమున సత్యమును అవలంబించి అసత్యముచు విడుచుటకై యత్నపడవలయును.

మాల్యే.

హిందువులు బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులను దేవతలని నమ్మి వారి ప్రతిమలను పూజించు చున్నారు. బ్రహ్మ కామాతురుడై అనేక మృగములనున్న తన కూతురును సయితము సంభోగిం

చినాడు. విష్ణువు చేప తాబేలు-పంది: మొదలగు రూపములు ధరించి అపవిత్రములను భక్షించినాడు. కృష్ణుడై అవతరించి వ్యభిచారము దొంగతనములు చేసి మద్యపానియై యుండినాడు. మహాదేవుడు అనేక పతివ్రతలను చెరచినాడు. నేను వివరించి చెప్పవలయునన్న సభవారు మిక్కిలి వేసట పడుదురు. ఇటువంటివారు దేవతలగుదురా? ఈ విషయము "రద్దే హిందూచరిత్రము" లో విశదముగా వ్రాయబడినది. దానికి ప్రతి, హిందువులిదివరకు చెప్పలేదు. గనుక హిందువుల మత సాంప్రదాయములన్నియు ఖండింప బడినవి.

## విద్యాలంకారుడు.

రద్దే హిందూచరిత్రములోని ఖండనములన్నియు పురాణసంబంధములైయున్నవి. పురాణములు కల్పిత కథలుగాని వేదశాస్త్రములుగావు. బ్రహ్మ సరస్వతిని పొందెననుట పురాణములోని యలంకారము. సరస్వతియనగా వాక్కు అని యర్థము. "గీర్వాగ్వాణీ సరస్వతి" యని

అమరము. మేము నమ్మనట్టియు, మాకు ప్రమా ణములు కానట్టియు గ్రంథములలోని సంగతులకు ప్రత్యుత్తరము చెప్పవలసినది మాకక్కరయుండదు. మీరు, పవిత్ర గ్రంథమని చెప్పెడు మరియు దేవుడు దయచేసినదనెడు తౌరేతగ్రంథములో లూతు పైగంబరు తన యిద్దరి బిడ్డలను, సంభోగించి, పెద్ద దానివలన మువాబునున్ను, చిన్నదాని గర్భమున అమీనిన్ని పుట్టించెను. (తౌరేత్ పైదాయిశ్ 19 బాబు 20 ఆయతే) మాకు ప్రమాణగ్రంథము గానుండువానిలో త్రిమూర్తులు దేవతలని చెప్పలేదు. వారును మీకు పైగంబరులవలె మాకును దేవభక్తులుగా నున్నారు. ఈ దేవభక్తులగు త్రిమూర్తులను గురించిన కథలుగాని వారి ప్రస్తావనగాని వేదమునందులేదు. తన భోజన పాత్రమందు చచ్చిన కప్ప పడియుండగా చూడలేక పరుల గుడ్డమీద సీగలు కూర్చున్నవని అధిక్షేపించుట న్యాయము గానుండలేదు.

రాజు.

హిందువులు - తల్లి- తండ్రి-గురువు -న్యాయాధి పతి-విద్వాంసులు- ఈశ్వరభక్తులు మొదలగువారిని దేవతలని పిలుచుచున్నారు. దేవశబ్దము-బిరుదు నామముగా నున్నది. కృష్ణుని గురించి భారత ములో దుష్టవిచారము లేమియులేవు. బోపదేవు డను శాక్తేయుడు రచించిన భాగవతమును పండి తులెవరును ప్రమాణముగా స్వీకరించరు. కృష్ణుడు భగవంతుడని విద్వాంసులెవరును చెప్పరు. అతడు నుమానవమాత్రుడే. మీాముహమ్మదును గురించి తఫసీరహుసేనీ గ్రంథములో చూడుడు. జైద అను వాని భార్య ముసమ్మాత అను స్త్రీతో ముహమ్మ దు వ్యభిచరించినాడు. ఇంతియకాదు తనకుమారుని భార్యను సంభోగించినాడు. ఇలహామీాపైగంబరు లలో ముఖ్యుడగు దావూదు పైగంబరు ఓరియా హుని భార్య బితశా అనువానిని మోసపరచి వ్యభిచరించి దాని భర్తను చంపినాడు. (సముఎ యీల్ బాబు 11 ఆయత 6-25) ఈ దావూదు

పైగంబరుద్వారా జబ్బూర్ గ్రంథమును దేవుడు పంపెను. మనుష్యులు వ్రాసినట్టియు మేము అబద్ధపు కథలని నమ్మినట్టి పురాణములలోని సంగతులున్ను, దేవుడిచ్చినదని సత్యమని మీరు చెప్పెడు గ్రంథములలోని సంగతులున్ను సమానముగానే యున్నవి. మీసత్యము, మా అబద్ధమునకంటె ఆశ్చర్యముగానున్నది.

ధర్మపాలుడు.

ప్యారే పండితజీ! లగభగ్ ఆఠసౌ బరసకే పీఛే బోపదేవ నామకా యేక శాక్తవైష్ణవనే, భాగవత బనాయాహై-జిసనే, కృష్ణజీపర్, బహుతసే ఝూట్ లగాయేగయేహై-ఔర్ రాసలీలా ఆది నిందనీయకథా బనాయీ. ఏ-సచ్చాకితాబ్ నహీహై. కురానకీసూరత్ ఔర్ సూరత్ తహరీర్ కో దేఖో, ఉనమే ఐసానిందనీయకథా-ఇస్సే, బహుత్ బఢకర్ హై.

ప్రపన్న రంగరామానుజులు. (లేచి నిలచి)

మహా ప్రభూ! నేనీసభలో గూర్చుండ జాలను

వెళ్లి పోవుచున్నాను.

రాజు.

స్వామీ! కారణ మేమి? మిమ్ములనుగురించిన అసభ్యచేష్టలేమైన నిక్కడ జరిగినవా?

ప్రపన్న రంగరామానుజులు.

భాగవతము ప్రమాణముగాదని, కల్పితమని, బోపదేవుడను శాక్తేయుడు రచించినదని, కృష్ణుడు భగవంతుడు గాడని, దేవరవారి దివ్య వాణినుండి వెడలినప్పుడు, నే నిచ్చట కూర్చుండి యెట్లు విన గలను? ఈ సాహేబుగారు కృష్ణుడు పంది అని పరిష్కారముగ జెప్పిరి.

రాజు.

తాము సభనువిడిచి లేచి పోవడమువలన భాగవతము ప్రమాణ గ్రంథమై, కృష్ణుడు భగవంతుడగునా? మీవంతు వచ్చినప్పుడు దానిని సిద్ధాంతము చేయవచ్చును. మాల్వీసాహేబుగారు

మొదటనే శాంతముగా నుండుటకై సభవారిని ప్రార్థించినారు. ఇచ్చట యిప్పుడెవ రేమైన అబద్ధములు చెప్పినారా? మేమిప్పుడు మహమ్మదీయ సిద్ధాంతములను వారి గ్రంథ ప్రమాణములనుండి ఖండనచేయుచుండలేదా? వారు వినుచుండలేదా? కృష్ణుడు పందిగా నవతరించి యుండెననుట, మీ కవమానముగా నున్నప్పుడు, అట్టి సంగతిని గలిగి నట్టి గ్రంథమును, మీ రెట్లు గౌరవించి ప్రమాణ గ్రంథమని చెప్పుచున్నారు. ఒక గ్రంథము, మీ కవమానముచేయవచ్చునా? మేము పక్షపాతముగ ప్రసంగము చేయడము లేదు. మతావేశమును జూపుటలో, మహమ్మదీయులంతటి ఆగ్రహగ్రస్తులితరులు లేరు. అట్టి మౌల్వీ సాహెబుగారు, మా ఖండనమును, శాంతముతో వినుచు ప్రసంగించు చుండగా, తామల్పములోనే, సభను విడచిపోయిన మాత్రమేమున్నది? ఇందుకు మౌల్వీగారు చెప్పవలెను.

మౌల్వీ సాహిబ్ కాశింగారు.

స్వామీ! సత్యమును గ్రహించుటకై వచ్చి యుండినయెడల, తామిచ్చట నుండవచ్చును. మా యింటి పిల్లికి యేడుకాళ్లు, అయిదు కన్నులే, యని, పట్టుదల గలిగి యుండినయెడల, పోవుట సమంచితమని, నా యభిప్రాయము.

విద్యాలంకారుడు.

మౌల్వీగారొక్క వైష్ణవ మతమును గురించి చెప్పక హిందూధర్మములపై సంగ్రహ రూపమైన ఆక్షేపణ చేసినారు. మేము సమాధానములు చెప్పుచున్నాము. మధ్య మధ్య యెవరును హఠ దురాగ్రహములు చూపక శాంతముతో వినుచు సత్య పక్షముగా నుండవలయును. సత్యము సార్వ దేశీయమైనది. దానినే అందరు కోరదగినది.

(రామానుజులవారు కూర్చుండిరి.)

## మహాత్మ్యే.

మహా దేవుని గురించి సమాధానము రాలేదు. అతడు భార్యా బిడ్డలుగల సంసారిగా నున్నాడు. యెద్దు మీద కూర్చుండి స్వారిచేయువాడు. ఇతనిని దేవుడని శైవులు నమ్ముచున్నారు. మహా దేవుని పేరు వేదములో స్పష్టముగా నున్నది.

## రాజు.

వేదములో మహా దేవుడనగా భగవంతుడని అర్థము. అతడు సంసారియనిగాని యెద్దు మీద గూర్చుండువాడనిగాని, దేహధారియనిగాని వేదమున చెప్పలేదు. పురాణములలో చెప్పిన మహా దేవుడు, హిమాలయపర్వత ప్రాంత్యములోగల శివాలిక్ కొండల ప్రదేశమునకు రాజుగానుండిన యొక మానవుడు. పర్వతరాజు గనుక నతనికి పార్వతేశ్వరుడనియు నతని సతికి పార్వతియని పేరులుండినవి. పర్వత ప్రాంత్యములలో రధములు సంచరించుట కనుకూలముండలేదు గనుక నాతడు తరు

చుగా 'సెద్దుమీద సంచారము చేయుచుండెను. ఆతనిని గురించి కవులు కొన్ని విషయములలంకారముగ వర్ణించి యుండవచ్చును. శివపురాణము వేదము కానేరదు. ఒక పేరు—మనుష్యునకును దేవునకును నుండుటచేత మానవుడు దేవుడు కానేరడు. ఎందరో పరమద మహామ్మద నామముల గలిగినారు వారందరు ఖుదా పైగంబరులగుదురా?

విద్యాలంకారుడు.

తమ యాక్షేపణలో దేవుడొక స్థలములో, కాపురముండునా యను సంశము స్ఫురించుచున్నది. సత్య వేదశాస్త్రములందెచ్చటను దేవుడేక దేశమున నివసించువాడని చెప్పబడలేదు. ఖురానులో దేవుడేడవ యాకాశములో నున్నాడని చెప్పబడినది.

మౌల్వీ.

దేవాలయములు కట్టించి దేవతా ప్రతిమలను నిల్పి 'సర్వత్ర సర్వ హిందువులును ప్రత్యక్షముగ

పూజలుచేసి నైవేద్యములు సమర్పించుచుండగా తాము వేదశాస్త్రములలో లేదని చెప్పెదు సమాధానమునెట్లు స్వీకరించ వలయును?

విద్యాలంకారుడు.

ఇప్పుడు మనము, పూర్వపులోకోపకార పురుషులయొక్క జ్ఞాపకార్థమై పటములు, విగ్రహాము లుంచుకొనులాగున మాపూర్వులు లోకోపకారులగు రామ కృష్ణ మహేశాదుల విగ్రహములను నిచి వాని రక్షణార్థమై మందిరములు కట్టించి, అందులో అతిథులు అభ్యాగతులు సన్యాసులు మొదలగువారు వచ్చి దిగుటకు వసతుల నేర్పరచి యున్నవారు. కాలక్రమమున నిది మార్పును పొందినది. ఇప్పుడైనను పామరులు విగ్రహములను పూజింతురుగాని జ్ఞానులట్లు చేయరు. మాలో జ్ఞానులు చెప్పెయందుదానిని వినుడు.

పాట. శహనా

గతితోచని పరివ్రాణ్ణపరాత్మకు-క్షితిలో నావా

హానమేలా। మిఱియులేని బ్రహ్మాండాధారున కతి శయమైన యాసనమేలా ॥ప॥

నిరుపమ నిర్గుణ నిత్య తృప్తుడగు—నీశున కాచ మనంబేలా। నిరవధి కుండగు నిర్లేపునకీ— నిరుప యోగపాద్యములేలా ॥౧॥

నిత్య శుద్ధమై నెగడెడువానికి—మర్త్యస్నానం బులు నవియేల। ఉత్తముడై బ్రహ్మాండమునిండిన సత్యాత్మకు వస్త్రములేలా ॥౨॥

ఎందుజూడనందే గలవానికి—గంధాక్షత సూత్ర ములేల। వందిత పూర్ణానందునకా భరణందంబులు జేయగనేల ॥౩॥

రూపులేని సుఖరూపునకీజడ—దూపదీపంబులున వియేల। శ్రీపరంజ్యోతియు నాపరమేశునకీ పలునై వేద్యములేలా ॥౪॥

ధీరుడు లోకాధారునకీవృథా—పూరణ నీరాజన మేల। పారరహిత పరిపూర్ణుని కిలలో—వేరొప్రద క్షిణమదియేల ॥౫॥

ఈ లాగున మాతో ననేకులు చెప్పియున్నారు. గనుక విగ్రహారాధన వేదోక్తము కానేరదు.

ధర్మపాలుడు.

ముసల్మానులు మొహరంలో హసేన్ హుసేన్ తట్టలను నిలువబెట్టి మేవాలు సమర్పించి చాహుసేన్ బాహుసేన్ అను పదములుచ్చరించుచు ఆల్బిదాలుపాడుచు ఆరాధించుచున్నారు. గోరీలకు పూజచేయుచున్నారు. గనుక మీచెట్లలో పురుగులు పడిన మామిడిపండ్లున్నవి; మా చెట్లలో పుచ్చిన కాయలున్నవి. మీరు మసజిదులు కట్టుకొని పడమటి ముఖముగా కూర్చుండుచు లేచుచు, నమాజు చేయుటకర్థమేమి? దేవుడు పడమటి గోడలో నున్నాడా? హిందువులలోని మూఢపద్ధతులను మూర్ఖులు మాత్రమవలంబించి యున్నారు; జ్ఞానులు మూఢాచారములాచరించరు. మీముసల్మానులలో పామరులు మొదలుకొని పండితుల వరకును మూఢ్యులై యున్నారు. ఏమతములోగాని ముక్కులు కోసికో వలయునని కట్టుబాటున్న యెడల నందరు నవ్వుదురు. మీలో చూడుడు- మర్మాంగములను కత్తిరించుకొనునట్టి విధి, పండిత

పామరులలో సమానముగనున్నది. సునోమాల్వ్రజీ! తుమారే యాకూబ్ నబీనే, ఖుదాసే కుస్తీకీహై. క్యా ఖుదానే దునియాంకే ఆదమీసే, కుస్తీకరకే హారజాతాహై? ఏసైసా ఖుదా? కైసా పైగంబర్, కైసా మహాజహాబ్ హై? ఐసాకథనకో, మాననేవాలా, నిశేపాయి జామాహై వానహీ?

రాజు.

ప్రపంచములోని సర్వమతములలోగల పూజలను గురించి మాలో సాధుపురుషులు చెప్పినదానిని వినుండు.

పాట. హిందూస్థాని కాఫీ అథవా బ్యాగ్.

ఏ-చాల చలావే క్యా ఉలటోకో-పీరూకోపుజవాతేహై। క్యాపిత్తల్ మే దేవబిలేజబ-శ్రీనకా ధ్యానఛుడాతేహై ॥ప॥

ఏ-హాథీఘోడా బైలగధాకో-గోరీభీపుజవాతేహై। అజ్ఞాన బనాకర్ లోగోంకోయే-క్యాక్యా ఖేలరచాతేహై ॥౧॥

ఏ-వేష పుజావే బడపీపల్ వో—తులసీకాభీ వ్యాహకరే । జో—ఖావే భేడే బకరే గోష్త—బిహిష్త మిలే ఉపదేశ కరే ॥౨॥

సబ—సద్దీనాలె ఘరాండచు కేతబ— రేతీపర్ భీ వారకిరే । ఏ—గారపుజావే కేతీకీఫిర— కేతీకీభరమారకరే ॥౩॥

ఊంత భూతే అరు పీరపైగంబర—మాంతసీతలాపూజకరే । ఆత్మబోధ వినక్యాఫిర తేహో — ఝూటాటూటాటాలీమే ॥౪॥

ఇందువలన మనమందరము ను జడపదార్థములను సేవించుటయు, మూర్తిపూజలను గావించుటయు, వేద ధర్మములుగాదని తెలిసి, త్యజింపవలయును. మనము జారులై .. చోరులై— దుష్టులై— తిరుగుచు, మన తండ్రిని పూజించిన యెడల, నతడు సంతసించునా? లేదుగదా? గాన దేవునకు మన మంచిగుణములు ప్రీతిగానుండునుగాని, మన పూజలకు సంతోషింపడు.

## విద్యాలంకారుఁడు.

సభ్యులారా! లోకముననందరివలెనే మహమ్మదీయులున్ను యేకేశ్వరోపాసకులుగా చెప్పుకొను చున్నారుగాని, దేవుని స్వభావమును గురించి మాత్రము ఆ మత గ్రంధములు వివరించి చెప్పలేదు. ఈ లోపములను "1 తకజీనబరాహీఁ అహమదియా 2 నుసఖే ఖబ్తు అహమదియా 3 తహాజీవఇఖలాక్ 4 హుజ్జతుల్ ఇస్లామ్" మొదలగు గ్రంధములలో విశదముగా చూపబడినది. గావున మాల్వీగారును యిష్టమైన సభికులును ఆ గ్రంధములు చదువుకొని లోపములు తిద్దుకొనవచ్చును

## మాల్వీ.

నేనింకొక ప్రశ్న వేయుచున్నాను. హిందువులుహరామ్ మురదార్ అనగా అభక్షణ పదార్థములను తినుచున్నారు. దీనిని మానుకొనుట మంచిది.

## ధర్మపాలుడు.

అసలు మాంసము తినుటయే - నిషిద్ధమని మాలో వేదశాస్త్రిములు చెప్పుచున్నవి. మన కున్ను జంతువులను చంపునప్పుడు, అవి, యనుభ వించు ఘోరబాధను దలంచుకొన్న యెడలను, చూచినప్పుడును, యిది ఈశ్వరునికి ప్రీతికాదని మన హృదయమునకు బోధయగుచున్నది. మాంసమును తినవచ్చునను పక్షమువహించినప్పటికిన్ని, దేవునివిధిచొప్పున, ఆయువుతీరి చనిపోయిన జంతు మాంసములను తినకుండా, బలవంతముతో, కుత్తి కెకోసి, తినవలెనని చెప్పిన దేవుడుండడు. అట్టివా డెప్పటికిని దేవుడుకాడు. ఈ విషయములో హిందువులు యజ్ఞాదులలో జంతువులను ముసల్మానులవలెనే, చంపి భక్షింతురు. దీనిని శాక్తేయుడగు మహీంధరుడు, వ్యాపింపచేసెనుగాని, హిందువులలో ననేకులు, వాని పద్ధతిని ఖండించిరి. యాగాదులలో చంపబడిన జంతువులును, బిస్మిల్లా చేయబడిన జంతువులును, స్వర్గము చేరుననిచెప్పె

వను. ఒకవని పంపినప్పుడు, చచ్చినవాడొకవేళ స్వర్గమునకు జేరినను, చంపినవానిని, ప్రభువులు పట్టి కట్టి శిక్షించినట్లు, యీ హంతకులకు సయితము నరకప్రాప్తియగునని నా సిద్ధాంతము. దేవుడు చంపినది హారామనియు, మనుష్యుడు చంపినది, పవిత్రమని భావించినవారికి తెలివికి, నా కాశ్చర్యమగుచున్నది.

మాత్రీ.

మనము పాఠశాలలో పిల్లవాండ్లను కొట్టి శిక్షించి విద్య చెప్పుచున్నాము. అది వారికి బాధగాను, హింసగానున్నప్పటికిన్ని, భావికాలములో మేలుకలుగును. అలాగుననే బిస్మిల్లాచేసిన పశువులిక్కడ బాధింప బడినను, స్వర్గసుఖము భవిష్యత్కాలమున లభించును.

ధర్మపాలుడు.

తుమ్ జానవరోంకో గల్లాకాటకర్, బహిష్తుకోభేజేతో-తుమారా లడకా, లడకీ, బచ్చీ,

బేటా, మా, బాప్ ఔరోంకో గల్లా కాటకర్, క్యోం బహిష్త్‌కో నహీం భేజతే? ఇసలియే—యే బాత్ ఘూటాల్ జాన పడతాహై. హే–భాయియో! ఖుదాకే నామపర్ దీన జానవరోంకో గల్లాకతల్ కరకే, లహూంసే ఆనంద మచాతేహూం! హాయ్ హాయ్!! ఏ కైసా భగవాన్‌కా ఆయతహై? ఏ కైసా యజ్ఞయాగాదిహై? అల్బత్తా జహన్నంకా రాస్తా ఔర్ సైతానకా ఆజ్ఞాహై. సువ్వరకో, తుమ్, క్యోం హరామ్ బోల్తేహై? హరామ్ హైతో, ఉసకా నామ కురానమే క్యోంహై? మహమ్మద సాహిబకే ముఖసే ఉనకే నామ క్యోంనికలా? తుమ్, క్యోం కురానకేనాథ్ సువ్వరకే నామ బోల్తెహై? హే సువ్వరో! తుమ్, ముసల్మానీ ఛురీసే బచాలియా. ధన్యహూం! పుణ్యహూం! భగవాన్‌కో నమస్కారకరో!

విద్యాలంకారుడు

మహాజనులారా! మాంసభక్షణములోను మద్యపానములోను దోషమును చూపుటకై మనలోని సాధులు చెప్పియుండుదానిని వినుడు.

పాట. శంకరాభరణ.

వేయుచు రార దండోరా—ఇట్లు—వేయుచు వీధుల నెల్లగవలెరా ॥వే॥

విద్యలేనివాడు వినరా—వేద—వేద్యుని దెలియని వాడు శూద్రుడురా। చోద్యముగ దిది వినురా—ఎవడు—మద్యము ద్రాగునో వాడు మాదిగరా॥వే॥౧॥

సంసారియగువాడు వినరా—పరమ—హంసుని గురువుగా గైకొనవలెరా। హింస జేసిన పాపియగురా-ఎవడు—మాంసముదినునో—వాడు మాలడురా ॥వే॥

కల్లలాడిన చెడుగగురా—లోక—మెల్ల దైవాధీనమని నమ్మవలెరా। యెల్ల జాతులలోను వినురా-యెవడు—కల్లుద్రాగునో వాడు కడుచండాలుడురా॥వే

నీకొక్క మాటజెప్పదరా— దాని—నాకళింపుతో డనమ్మియుండుమురా। లోకమందెవడైనగనరా—గొఱ్ఱెమేకల నరికినవాడు మాదిగెరా ॥వే॥ ॥౪॥

మత్తు కలిగియుండకుమురా—వేద—వేత్తలు దెల్పిన వినవలెగదరా। చిత్తము నిల్పియు వినరా—జంతు-కుత్తుకల్ గోసిన క్రూర మాలడురా ॥వే॥ ॥౫॥

చేరు జెప్పినదాని వినురా—అను-మానముండిన నన్ను మరల నడుగుమురా । మానము లేదు చూ గుమురా-సురా-పానము జేసిన పంచముండౌరా॥వే

శూరవీరుడు ధీరుడౌరా-ముఖ్య-సారము దెల్పితి సంపాదించుమురా । సారె సారె కదు చాటించుమురా-ఓరు-సారాయిద్రావిన చండాలుడేరా ॥ వే ॥ ॥౭॥

ఖండించువాడును వినురా _ దాని అండజేరిజూచువాడునువినురా । కండలు గోసియుకచరా-తీసి-వండి వడ్డించిన వారంత్యజులురా ॥వే॥ ॥౮॥

వంచనగాదిది వినురా-ప్ర-పంచమునిండుగ పాపమెగదరా । యెంచగ నంజుడంగడిరా-దాని-పంచిపెట్టెడువాడు పంచముడనరా ॥వే॥ ॥౯॥

నూది గ్రుచ్చిన నెట్లుండునురా-ఆహా-బాధను దెలిసియు బాధించుగదరా । సాధు జంతువుల జంపునురా-వాడు-ఐదవకులము వాడనగ జెల్లునురా॥వే

కుక్షిని నింపుటకేరా_ నేనే-దక్షుడనుచు అంబు దెచ్చునుగదరా । పక్షుల వేటాడి వినురా-పట్టి-భక్షించువాడొక్క భడవా మాదిగెరా ॥ ॥వే॥౧౧

తేప తేపకు గాలములురా - వేసి-కోపముజూపు
చు గొంతునులుమురా । వాపీ కూపములమనమల
రా-మెలగు చేపలదినువాడు పాపి మాలకురా ॥వే
ఏట్సి ఘోరములివిగనురా-రాయి-మట్టికట్టెసం
చలోహమ్ములగురా । పెట్టి దేవతలకునెదురా-తల
ల-గొట్టెడువాడు డొక్కలజాతిగదరా ॥ వే॥ ౧౩॥
ధైర్యధురీణులుగదరా - కృత - కార్యసంపన్నత
గలిగిన వినురా । ఆర్య ధర్మము శ్రేష్ఠముగురా-స
త్య-శౌర్యము సాధు సంరక్షణగదరా ॥ వే॥ ౧౪॥

ఇందువలన మాలో మద్యమాంససేవన వేద చోదితముకానేరదు. మద్యమాంసముల సేవించు వానియందు ధర్మముగాని, పుణ్యముగాని, నీతిగాని, న్యాయముగాని లేదు.

మాల్వీ.

మాలో ననేకులు చదువుకొన్నవారు, కబ్రపూజా, స్థానపూజా, హాసేణ్ హుసేణ్ పూజ మొదలైనవి చేయరు. మాలో గొప్పవారిట్లు చెప్పియున్నారు.

## గజల్.

నహీం మందిర మసజిదమ కే మే- నహీంగిరజాతా సురద్వారే మే. ॥౧॥

నహీంశంఖ నహీంఘంటే మే-నహీం బిస్మిల్లాపుకారే మే. ॥౨॥

నహీం ధరతీనహీం ఆస్మానమే-నహీం సూర్యచంద్రతారే మే. ॥౩॥

నహీం గంగా నహీం యమునా మే-నహీం సరయూ సింధుకినారే మే. ॥౪॥

తిలకఛాపనహీం కంఠీమే - నహీం గేరువాన స్త్రిధారే మే. ॥౫॥

నహీం ముక్తివినజ్ఞాన-జ్ఞానమిల్తాహై ధర్మవిచారే మే. ॥౬॥

జగన్నాథమేనహీం భాతమే-నహీం జూంఠకే ఖానే మే. ॥౭॥

నహీం కాశీమే నహీం ప్రయాగమే-నహీం త్రివేణీ స్నానే మే. ॥౮॥

నహీం గోకులమే నహీం మధురా మే-నహీం నంద

గాంవ పరసానేమే. ||౯||

నహీం ద్వారికామే రామేశ్వర-నహీం బదరీనాధ కేజానేమే. ||౧౦||

నహీం పీపల నహీం తులసీమే-కుఛ్ నహీం బేలకీ పత్రీమే. ||౧౧||

నహీం జ్ఞానవినాముక్తి - నహీం అధర్మమిధ్యా కర్మమే, ||౧౨||

నహీందాఢీమే నహీంసున్నీమే డాంగమే గల్లాకతల్ మే. ||౧౩||

నహీం మేవామే మక్కా_మదీనామే - నహీం లా ఇలాహి ఇల్లల్లామే. ||౧౪||

సభాజనో! హమ్ తుమ్ మిలకర్ లోగోంకో సచ్చారాస్తాదిఖాకర్, యేసబ్ పాషబఖేడియాంకో, ఛుడాదేనా చాహియే. సబ్ మతమే సబ్ మజహబమే-పాషహై సబ్ మే భూల్ చూక్ హై. హమ్ సబ్ హజారోం ఖోటీ కూపమే ఫంసపడేహై. హల్లా లల్లోకహాకర్, పుకారామచాయతో, కుఛ్ ఫాయిదానహీంహై. ఏక ఫకీర సాహిబ్ బోలేహై «బిస్మి

ల్లామే భూల్ హై సమఝనేవాలే-నహీం హై"

ధర్మపాలుడు.

సభ్యులారా! హిందువులు గంగలో స్నానము చేసినచో మోక్షమని, తిరుపతిలో తలగొరిగించు కొన్న ముక్తియని, జగన్నాథములో యెంగిలి తిన్న పుణ్యమని, రామేశ్వరమునకు పోయినయె డల స్వర్గమని నమ్ముచున్నారు. మహమ్మదీయు లు మక్కాకు పోయిన మోక్షమని కాబేలో చ చ్చిన స్వర్గమని, మదీనాకు పోయిన పుణ్యమని, ఇట్టి నటనలు తీర్థయాత్రలు మోక్షమునివ్వజాలవని వారిలోని సాధువులున్ను చెప్పియున్నారు. వినుండు.

పాట. కన్నడ.

ఏమున్న దేమున్నదీ-ఎచ్చటబోవ నేమున్న దే మున్నదీ ॥

మందిరమసజిద మక్కా-మదీనా-నందీశ గిరిజా నందఠాకురముల ॥యే॥ ॥౧॥

శంఖములూదిన గంటలువాగిన – పొంకముగా
బూరు బూరువాయించిన ॥యే॥ ॥౨॥

గంగ యమున సింధు కృష్ణ గోదావరి–మంగల
నర్మద సరయులమునిగిన ॥యే॥ ॥౩॥

తిలకము నామము తిద్దినవిభూతి – వలయమైన
ముద్రలెన్ని ధరించిన ॥యే॥ ॥౪॥

అశ్వత్థ వటబిల్వ తులసిభూజములలో అశ్వము
నావుగ జాదులలోపల ॥యే॥ ॥౫॥

ఈసామహమ్మద మూసారామకృష్ణ – కాశీవి
శ్వేశ్వర కాళీనిదలచిన ॥యే॥ ॥౬॥

రుద్రాక్ష కమలాక్ష స్ఫటికాక్ష యేకాక్ష–భద్రా
క్షముక్తాక్ష సరములదాల్చిన ॥యే॥ ॥౭॥

కాషాయ కౌపీన దండకమండల–ఆసనవ్యాఘ్రి
కళాసవేషములలో ॥యే॥ ॥౮॥

ఉపవాస యుద్యాన జపపూజ వ్రతాది చపల
త్వమైన యీయుపధర్మములయందు ॥యే॥ ॥౯॥

శమదమ సత్యదయాదర గౌరవతమశాంతశుద్ధ
విజ్ఞానములేకున్న ॥యే॥ ॥౧౦॥

మన పూర్వీకులీప్రకారముగా ఉత్తమగుణ కర్మ స్వభావములు మోక్షమునిచ్చునని చెప్పినారుగాని జడపదార్థములు, వేషములు, ముక్తిదాయకములని చెప్పలేదు. నేనింకొక సంగతి చెప్పవలసియున్నది. హిందూ దేశములోనిప్పుడుండు మహమ్మదీయులు, అందరు ముసల్మానులుగా నేరరు. వీరందరు పూర్వము హిందువులుగానుండి, మహమ్మదీయ ప్రభుత్వకాలమున, నామతములో జేరినవారు. పరదేశమునుండి యీదేశమునకు వచ్చిన మొగల్ పఠానులెవరును, యిక్కడ నిలువలేదు. ఈ రహస్యము తెలియక, మహమ్మదులు హిందువులతో, ద్వేషభావము కలిగి వర్తించుట, మిక్కిలి వ్యసనకరమైన సంగతి. హిందువులున్ను వారియెడల హితముగా నుండవలయును.

మార్వా.

మేమెవరికిని యేవిధమైన తొందరలు లేకుండ మసజిదులలో దేవుని ధ్యానించు నప్పుడు హిందువు

లు బాజాభజంత్రీలుచేసి హారముఃకో ధ్యానభంగ
ము గావించుచున్నారు. ఇది కేవలము పౌరబా
టుగాను పాపముగా నున్నది.

రాజు.

మాల్వీగారు మరల మొదటికేవచ్చిరి. బాజా
భజంత్రీ మేళ తాళములకు ముసల్మానుల ధ్యానము
పక్షివలె ఆకాశమునకు పారిపోవునా యేమి! ఒక
డు ఖూనీ నేరములుచేసి, జడ్జీని ప్రార్థించి ధ్యానించి
తే, వానిని విడిచిపెట్టి గొప్ప యధికారము సమ
ర్పించునా? అట్టి అధికారిని యెవరైన, న్యాయ
కారియని చెప్పుదురా? ఆలాగుననే ముసల్మానులు,
అనేక సాధుజంతువులను, జంపి, దేవుని ధ్యానించిన
యెడల, అతడు క్షమించి, మోక్ష మిచ్చుననుట,
యెంతపిచ్చి భ్రాంతియనవచ్చును.

మాల్వీ.

మహమ్మదు పైగంబరు శిఫారసువలన ముక్తి
కలుగునని మేము నమ్ముకొన్నాము.

రాజు.

మహమ్మదు శిఫారసే — ముక్తియయినప్పుడు, దేవుని నెందుకు ధ్యానించుచుండవలయును? మహమ్మదు శిఫారసుతో నేరములు, పాపములు, క్షమింపబడి, స్వర్గములభించుట నిజమైతే, లోకములో, యిప్పుడు, శిక్షలననుభవించుచుండు మహమ్మదీయులనందరిని విడిపించవచ్చునుగదా? హిందువులున్న యిట్లే, కొందరు, మానవులగు రామ కృష్ణాదుల శిఫారసులను, నమ్మికొని, బుద్ధిపూర్వకముగ, పాపములు చేయుచున్నారు. ఈ విషయమున పూర్వులు చెప్పినదానిని వినుడు.

వసంతవృత్తం.

హైౕ ముక్తి సాధన శరీరసబై బఖానై—హైౕ భోగ భూమి యహి పండితలోగమానై ॥
యాకే వినానహి యహాౕగుణరాశిఆవై—యే హీౕశరీరజగమే సుఖతా బతావై ॥ ॥౧॥
కాయావినా జగతమేనహి కర్మహోత్తే-కాయా

హీ ధర్మపథమే సుఖఫ్రాలబోతే ॥ ॥౨॥

హైఁ స్వర్గసాధన శరీరకరైసుధర్మా-హైఁ నరకకా
రణయహీ యది హోకుకర్మా ॥ ॥౩॥

కాయావినా నహీఁ ఛుటైయహబంధజాలా-హైఁ
యే శరీరహీ యహో శుభకర్మమాలా ॥ ॥౪॥

హోవే నదేహవిన జీవపరోపకారీ-హింసాదిపా
పరచనా అతిహానికారీ ॥ ॥౫॥

కైసేకరై వినశరీర కహోవిచారీ-హైఁ యే శరీర
హీగుణా గుణలాభకారీ ॥ ॥౬॥

చాహోచలో పరమధామ శరీరపాయీ-భోగో
మహా సుఖసదాదుఃఖకీనసాయీ ॥ ॥౭॥

చాహీఁ కరోనరకవాస వినాసఘాయీ-హైహా
థమేహీ అపనే సుఖదుఃఖభాయీ ॥ ॥౮॥

కాయాహింభుక్తి అరుముక్తి, సబైప్రకారై-భోగై
కసాధనయి నే మునిరాజభాసై ॥ ॥౯॥

ఇట్లు మన పూర్వీకులు, మంచి గుణకర్మస్వభావములు, మోక్ష హేతువులని చెప్పియుండగా "కాఫరోంకొకతల్ కరో" "లూటే వాస్తేఅగ్గాహకే

హై" ఇటువంటి వాక్యములుగల గ్రంథములను, దుష్ట ఉపదేశములను, నమ్మికొని, మన యంత రాత్మకు ప్రత్యక్ష విరోధమైన, జీవహింసలనుచేసి, మోక్షమనుకొనిన, ప్రయోజనమేమి? దేవుడు దయావంతుడని నమ్మితిమేని, మనమును దయావంతులు గావలయును. దేవుడు న్యాయకారియని, నమ్మితిమేని, మనమును న్యాయవంతులుగా ప్రవర్తింప వలయును. ఇట్టి చెడ్డ ఉపదేశములు, మతగ్రంథములలో నుండుటవలననే మహమ్మదీయులు, తండ్రులను, సోదరులను, సయితము, రాజ్యలోభముచేత, చంపియున్నారు. లూటీ చేయుట వారికి, పరమధర్మమై యున్నది. ఇది, యే దేవునకు ప్రీతియో, నాకు తోచదు. మహమ్మదీయులు, తమ సిద్ధాంతములను, సవరించుకొనవలయును. లేనియెడల వారెప్పటికిని యభివృద్ధికి రానేరరు. మహమ్మదీయులు మనుష్య శబ్దముయొక్క అర్థము తెలియరు. అట్లు తెలిసియున్నచో గోహత్యాది హింసల నెప్పటికిని చేయరు. సుఖ దుఃఖములు ప్రాణులకు సమానమని వీరిమతమునందొక యతి

రమైన లేదు. ఏ సాధుజంతువులనుండి తాము పాలు పెరుగు నేయి సంపాదించుకొని భుజించి, తమ దేహరక్షణము జేసికొనుచున్నారో, ఏ జంతువులు ధాన్యాదులను పండింపగా తాముతిని బ్రతుకుచున్నవారలో-యే జంతువులు చచ్చిన తరువాత తమ పాదరక్షులకై వాని చర్మములనుపయోగించుదురో, యే మృగాదులవలన నేర్పడు మలమూత్రాదులను యెరువుగా భూములకుపయోగించు కొనుచున్నారో అట్టి సాధువులగు నుపకారములగు పశ్వాదులను చంపి భక్షించువారికి సద్గతులుగలవా? ఇంతకంటె కృతఘ్నతయు, నింతకంటె ఘోరపాతకమును, లోకమునగలదా? ఇంత నిర్దయను బోధించునది మతమనబడునా? మేమొక్క దేవుని యుపాసకులమని చెప్పడమేమి? ముహమ్మదును విశ్వసించుట యేమి? కల్మాలలో, మహమ్మదు పేరుండుటవల్ల - నేకేశ్వరోపాసమునకు ఖడ్గమేర్పడినది. ఇది నిర్దయతోగూడిన మానవోపాసన మతమని సిద్ధాంతమగుచున్నది. ఈ ప్రసంగమింతటితో చాలును తాము కూర్చుండవలయును.

రాజు.

పాట. కాంబోది అథవా సురటి.

ఇక యెక్కడిదీ- సుఖమనుమాట ఓ-సఖధర్మపా లా! దెల్పుమా ||ఓ||

కన్నులుగలిగియు-మన్నునుదినునటు-లున్నవిలో కుల చిన్నెలుజూడగ । యెన్నగ రానివి-యెన్ని యోపాపము-లున్నను వేషములన్నిటి జిమ్మును ||ఇ

సజ్జనులడవుల జేరగనాయెను- దుర్జనులకు శిక్ష దుర్లభమైయ్యెను । ఒజ్జలనెవ్వరు బుజ్జగింపకను-యి జ్జగమున దస్యు రాజ్యమువెలసెను ||ఇ|| ||౨||

భూపతులందరు పాపియవిద్యను- చేపట్టుటచే యీ-చేటువాటిల్లెను । చూపగలవెయొక-సుగుణ పద్ధతినీ-పాపభీతి గల-పరమపవిత్రుని ||ఇ|| ||౩||

ధర్మపాలా? సాధారణ జనులుమొదలుకొని వి ద్వాంసుల వరకును మానవులు భగవంతునికి మి క్కిలి దూరముగ తొలగియున్నవారు. ఈశ్వరీ య ధర్మమును మరచి యున్నవారు. ఋషి శిక్షా

వంచితులైయున్నారు. ఈ యధోగతి యెప్పటి నుండి, ఆరంభమైనదోగాని, వెనుకకు మరలుటకు నసాధ్యమగునంత దూరము జరుగుచూ వచ్చినది. "ధర్మమార్గమున నడువుడు" అని యెవరు చెప్పెదరో, వారిపై ఆగ్రహము చూపునంతటి దుస్థితి దేశమునకు సంభవించి యున్నది. పుత్రుడా! మనము రసాతలమునకు జేరియుండలేదా? యద్యపి మనరాజ్యమందు, విద్వాంసులనేకులున్నవారు. వారి విషయములో నెంత యుదాసీనముగ నున్నారు? ప్రభువులెంత నిర్లక్ష్యముగ నున్నారు? ఆహా! యీ కల్పిత ధర్మ సేవనలో-యీ యజ్ఞానాంధకారములో-ఈ యీశ్వరీయ మార్గ విముఖములో-నీ వంచితమగు పంథములో సుఖమున్నదా? యెక్కడిసుఖము?

ధర్మపాలుడు.

పాట. కేదారగౌళ

భారతేశ్వర-బహువిధముల- బెదరనేల-సుఖము

దొరకగలదు మిగుల ॥ప॥

మానవాగ్రణి-చాలుచాలు- దీనభావముడగి వే
గ జ్ఞానపూర్ణుడగు- యానిఖిలేశుని-ధ్యానము చే
యుము-మానసంబుచల్లజేయు ॥భా॥ ॥౧॥

దేవ దేవుడు-దీన జనుల-బ్రోవగాచియుండగా-
దేవానీవిఁక-మానసమందుమను-ఆవంతయు-సుఖ భా
వనంబుబారదోలి ॥భా॥ ॥౨॥

భగవానుని యాజ్ఞలన్ని-భక్తిచేత పాలింతము-
దిగులులేని దివ్యచరితు - నిగమవేద్యునిపుడు- సుగ
మంబుగధ్యానింతము ॥భా॥ ॥౩॥

ప్రభూ! " రాజ్ఞిధర్మిణిధర్మిష్ఠాః పాపేపాపాః సమేసమాః। ప్రజాస్తదనువర్తంతే యథారాజా తథాప్రజా" ॥ అనువచనప్రకారము, రాజులు ధర్మ సంశోధనముజేయక పోయినప్పుడది, శిథిలమైపోవు చున్నది. ఇప్పటివారికి ధర్మప్రసంగము వినవలె నన్న నిద్రవచ్చుచున్నది. " యోభారతోస్మిన్ భువనే ఖిలేపి-శిరోమణీ రత్ననిధిః సదాసీత్, దేశే షు కింతూన్నతి మత్సు న్నత్సుపతత్యధోధోనుదినం

కథన్ను" అనునట్లు ప్రపంచమునంతటిలో శ్రేష్ఠ మయిన యీ భారతఖండ మధోగతికి బోవుచున్న మిక్కిలి పరితాపమై యున్నది. దినదినమును ధార్మికోత్కంఠ మభివృద్ధి యగుచున్నది. చింత లేదు, భారతసూర్యోదయ మనెడు తమప్రభావము న నీయజ్ఞానతిమిర నివారణమగు ననుటకు సందియ ములేదు. తాము ధర్మసంశోధనచేసి సత్యమార్గ స్థాపకులగుదురుగాత! సభ్యులారా! మీలో శైవ సాంప్రదాయకులు ప్రసంగించ వచ్చును.

బసవయ్యగారు.

పాట రేగుప్తి

జంగ మార్చనజేసి-లింగసంగులుపాప- భంగుల య్యెదరిలలో! (త్వరలో)గంగాధరుని యిష్ట లింగ ములోనిల్పి | పొంగుచు ఘనదివ్య - లింగధారణ తోడ ||జంగ||

భూతియు నుదుటను- బూసినచో పరమ-పాత కపరిహారమూ | (గనుమూ) జాతి సూతకములు-

నీతినిర్మలములు । యే తెరగునలేని - స్వాతంత్ర్యమై నట్టి ॥జంగ॥ ॥౧॥

భద్రమైనకొన్ని - రుద్రాక్షసరులను-రుద్రభావము చేతనూ । (ధరనూ) నిద్ర జాగ్రతలలో-నిత్యముధ రియించి-ఆద్రిజారమణుని-ఆత్మలోదలచుచు ॥జంగ॥

శివనామోచ్చారణ- శివలింగధారణ-శివ మూ ర్తిలింగార్చనా । (మననా) భవమంత్ర జపముచే- భవ్యులైధరియించి భవసంగరహితులై - భవదూరు లైనట్టి ॥జంగ॥

పంచచామరం.

- - ( - భ)మన్నిలింపనిర్ఝరీ-
విలోలవీచివల్లరీ విరాజమానమూర్ధనీ ।
ధగద్ధగధ్వనిజ్వలల్లలాట పట్టపావకే-
కిశోరచంద్రశేఖరే రతిప్రతిక్షణమ్మమ ॥

మహాప్రభూ! శైవ సాంప్రదాయమతి విస్తార మైనది. అయినను మన మన్నము వండునపుడు కొన్ని మెతుకులు పరీక్షించి పూర్వపక్వమెరుంగునట్లే

ముఖ్యసిద్ధాంతములవలన మామతముయొక్క పరి పూర్ణభావమును నివేదించుచున్నాడను.

"నకర్మణా నప్రజయాన యోగైర్నదాన ధర్మై ర్నతపోభిరుగ్రైన తీర్థయాత్రాభిరుపైతి మర్త్యస్తా దృక్ఫలంయచ్ఛివనామలభ్యం" అనగా మోక్షము నకు శివనామము-ముఖ్యముగాని, కర్మ యోగ-జ్ఞా న-దాన-ధర్మ తపము మొదలైనవి పనికి రానివని తాత్పర్యము.

విదూషకుడు.

ఈ మతమందు మోక్షము మిగుల సులభముగ లభించు • నట్లున్నది. రెండక్షరములుచ్చరింపబ డుటచే ముముక్షువులు మోక్షమును కొల్లగొట్ట వచ్చును.

బసవయ్య.

" జ్ఞానసౌభాగ్యసిధ్యర్థం సర్వానిష్టనివృత్తయే రుద్రాక్షధారణం ముఖ్యం ముముక్షూణాంతు వైది కం। సర్వసౌభాగ్యజనకం విభూతిరితిగీయతే ॥

మోక్షాపేక్షగలవారు విభూతి రుద్రాక్షలు ధరించవలయును.

విద్యాలంకారుడు.

ఏల? శివనామములో ననుమాన మున్నదా? శివశబ్దములో మోక్షముండగా విభూతి రుద్రాక్ష ధారణ లెందుకు?

విదూషకుడు.

అవి, శివశబ్దముచ్చరింపజాలని మూగివారలకు గాబోలును? నే భ్రమించితిని; శివనామ పఠనజేయు బసవయ్యగారును వీభూతి రుద్రాక్షలు ధరించి యున్నవారు. సిద్ధాంతములు పూర్తిగావినక మనము సమీక్ష చేయరాదు. జరుగనిండు!

బసవయ్య.

" ద్విత్రీణ్యతీవరమ్యాణి బిల్వపత్రాణిసాదరం।
యేనార్పితానిమేలింగే తేనముక్తిరవాప్యతే ॥ "

రెండు మూడు బిల్వపత్రములు లింగమునకర్పించిన

చో ముక్తియని శివుడే సెలవిచ్చియున్నాడు.

రాజు.

ఇప్పుడు నాకును సంశయము గలుగనాయెను. పైసాకు మణువుకస్తూరి యన్నప్పుడెవరికైన - నను మానమేగగా? కాని ఆవల సెలవిండు.

బసవయ్య.

" యావత్కాలం ప్రజ్వలంతిదీపాస్తే లింగమగ్రితః తావేద్యుగసహస్రాణి గతః స్వర్గే మహీయతే " లింగము సన్నిధిలో దీపము వెలిగించినచో, సహస్రయుగపర్యంతము స్వర్గనివాసము కలుగును.

విదూషకుడు.

ఈ మతసిద్ధాంతములత్యంత స్తోత్రార్హమై యున్నవి. సూదులతో బావిని త్రవ్వుటకుద్యమించిన వానిని శ్లాఘింపక నుండవచ్చునా? అయితే యింత సులభమైన వెలగలిగిన మోక్షముయొక్క లక్షణ మెట్లుండునో పరీక్షింవ వలయును. కానిండు!

బసవయ్య.

" ఏకంమోంచఫలం పక్వం యః శివాయనివేద యేత్ । సర్వభక్ష్యైర్మహాభోగైః శివలోకేమహీయతే ॥ " పక్వమైననొక యరటిపండును శివునకర్పించిన శివలోకము కలుగును. మరియు వినుము " యేనమంతి విరూపాక్ష మీశానం కృత్తివాసనం । ప్రసన్నచేతసోనిత్యం తేయాంతి పరమంపదం ॥ " విరూపాక్షునికి నిత్యము నమస్కరించినచో-పరమపదము లభించును.

విద్యాలంకారుడు.

స్వామీ! తాము సెలవిచ్చిన మోక్షమార్గములాను యొకటికంటె యొకటి సులభముగానున్నవి. తుదకొక్క నమస్కారమాత్రముచేతనుచితముగ మోక్షము జూపబడియున్నది. అయితే యివి మహాదేవుని ప్రసన్నతకు చాలియుండునా యని శంకగలుగుచున్నది.

### బసవయ్య.

ఇందుకు శంక కూడదు. యెందుకనగా సాక్షా త్పరమేశ్వరుడే “లింగాంగీచ మమప్రాణో లింగాంగీ మమరక్షకః । లింగాంగీ మమకర్తాచ లింగాంగీచ మమప్రభుః ॥” లింగధారులే- నాకుప్రాణము; లింగాంగులే-నాకు రక్షకులు; లింగవంతులే-నాకు కర్తలు; లింగాయతులే- నాకు ప్రభువులు; అని చెప్పినాడు.

### ధర్మపాలుడు.

దేవునికి లింగధారులే- కర్తలు, భర్తలు, రక్షకులు, మోక్షదాతలని దేవుడే చెప్పియుండగా దేవుడు లింగధారులకు మోక్షమునిచ్చునను మీ మాటలెట్లు నమ్మవలయును? దేవునికి మోక్షమును దయచేయు లింగధారులకు మోక్షమునిచ్చు మరియొక దేవుడెవరు? యెవరునులేరు. అనగా లింగధారులకు మోక్షము లేదని సిద్ధాంతమైనది.

బసవయ్య.

లింగధారులు స్వయం పరమేశ్వరులని ప్రమాణ ము వినుము. "రుద్రాక్షాః కంఠదేశే దశనపరిమితాః మస్తకే వింశతీద్వేషట్ షట్కర్ణప్రదేశే కరయుగళగతాః ద్వాదశాః ద్వాదశైవ। బాహ్వోరింద్రోః కలాభిః పృథగితి గదిత మేకమేవం శిఖాయాం వక్షస్యష్టాధికంయః కలయతిశతకం సస్వయం నీలకంఠః॥" ఎవరు కంఠమందు 32 శిరస్సున 40 చెవులలో 6+6 చేతులలో 12+12 భుజములందు 16+16 శిఖలో 1 హృదయమున 108 రుద్రాక్షలు ధరింతురో వారు సాక్షాత్ నీలకంఠు లు అనగా పరమేశ్వరులని తాత్పర్యము. ఇచ్చట పరస్పర విరోధమని మీకు సంశయము వలదు. అద్వైతులెట్లు జ్ఞానమువలన స్వయం బ్రహ్మలగుదురో అట్లు లింగధారులు సర్వపాపములు నశించి పరమేశ్వరులగుదురు.

ధర్మపాలుడు.

సర్వపాతకములు నశించుటకు వారుచేసిన మం

-చికర్మ లేవి?

బసవయ్య.

మాకు కర్మ లేదు. లింగధారణచేత పాతకము లు నశించును " తథాకృతంమహాపాపం లింగధారణతః పురా। యదస్తితల్లయంయాంతి లింగధారణతః పరం ॥" అని ప్రమాణముగలదు. గనుక లింగధారణాములవలన సాక్షాత్ నీలకంఠులగుదురు.

విదూషకుడు.

నీలకంఠులనగా, నూరపిచ్చుకలని యర్థము గనుక లింగధారులూరుపిచ్చుక జన్మము లెత్తుదురని, శ్లోకార్థముగానోపు. ఇందేది నిజము? గాడిదె కాలితో బియ్యముదంచిన వానికేమి ప్రాప్తించును? సభికులు చెప్పగలరా? పాపములు పోగొట్టుకొను వారికి, మంచియుపదేశము మాయింటి సాంప్రదాయ మొకటిగలదు; మాయింటిలో ముత్తవ్వలు, చీపురుకట్టతో దిగదుడుపుదీసి, పాపములనన్నింటిని,

యూడ్చి చేటకెత్తి, పెరటిలో పారవేయుదురు. ఈసులభమైన మార్గమందరు నవలంబింప వచ్చును. ఇందుకుదక్షిణ యొకస్యామర్పించుకొలవలయును.

బసవయ్య.

అనేకులు లింగమును శైవమతచిహ్నమని చెప్పు టగలదు. అది తప్పు అలింగాంగులగు భవులు, నూలిపోగును బ్రహ్మసూత్రముగా ధరింతురు. అది పాతదియైనచో, తీసి మరియొకదానిని ధరింతురు. దానిని, వారు ఆశ్రమ నాంకేతిక మందురు. మా లింగమట్లుగాక ప్రాణాంతమువరకు ధరింప వలయును. ప్రమాదమున పడిపోయినయెడల, ప్రాణము విడువ వలయును. అన్యథా పవిత్రుడు కాజాలడు. వినుండు! "ప్రమాదాత్పతితేలింగే ప్రాణానపి పరిత్యజేత్ | పతితే ప్రాణలింగే యోధత్తే ప్రాణాన్నరాధమః | సచండాల యితిజ్ఞేయః శ్శివద్రోహీ నతంస్పృశేత్ ||" "ప్రమాదాత్పతితేలింగే సహప్రాణాన్పరిత్యజ | ప్రాణవద్ధారయేతత్తు ప్రాణలింగమిదంతన ||"

ధర్మపాలుడు.

ప్రమాదమునకు ప్రాణత్యాగ శిక్షయు, బుద్ధి పూర్వకమునకు శిక్షలేకుండుటయు నెటువంటి న్యాయము? దేవుఁడు ప్రమాదమున పడిపోగలఁడా? దేవుడు స్వతః పతనుఁడైనవాఁడా, అథవా లింగధారుని ప్రమాదమా? మనుష్యుని ప్రమాదమున పడువాడు దేవుడెట్లగును? తానే స్వయముగా పడినప్పుడు, మానవుడెందుకు ప్రాణత్యాగము చేసికొనవలయును? ఈ ప్రకారమెందరు ప్రాణములు విడిచిరి? దేవుడు పడిపోవువాడుగాడన్న నీయసత్య సిద్ధాంతమెట్లు వ్రాయబడినది?

బసవయ్య.

ఇటువంటి అవకతవక ప్రశ్నలనువేసి, గెలిచేయుదురని తెలిసియే మా పూర్వీకులు భవులతో సంభాషించ కూడదని, వారితో స్నేహముచేయరాదని, వారియింట ప్రవేసింప గూడదని, వారి యిండ్లలో భుజింపగూడదని విధించి యున్నారు. చూ

డుడు ! “ భవిస్సంగ భవిస్నేహం భవిగే హోన్నభో జనం । భవిసంభాషణంచైవ వర్జయేత్ ఛీలవాక్ భవేత్ ॥ ”

ధర్మపాలుడు.

ఈ విధిని మీరేల మీరిప్రవర్తించుచున్నారు? భవులతో సర్వవ్యవహారములు చేయుచున్నారే. దీనికి ప్రాయశ్చిత్తమున్నదా?

బసవయ్య.

ఎన్నింటికని మేము ప్రాయశ్చిత్తము చేసుకొందుము? మాలో “వీరశైవస్య భక్తానాం శిరోముండనముత్తమం । శిరః కేశసమాపూర్ణ మధవర్ణనమాచరేత్ । అర్ధ ముండిభవేద్యస్తు పూర్వపుణ్యం వినశ్యతి। ఇహనాస్తి పరంనాస్తి నాస్తి నాస్తి వరాననే ॥ ” అన్నట్లు అర్ధశిరక్షౌరముచేయించుకొని జుట్లు విడిపించుకొన్నవారికి యిహపరములు రెండును లేవు ఇప్పుడందరును జుట్లు విడిపించి భ్రష్టులై పోయినారు. మరియు “ లింగధారణభ

క్త్వశ్చ లింగబాహ్యాసతీసుతౌ। చుంబనాలింగనంచైవ రౌరవం నరకం వ్రజేత్ ” అనగా లింగములేని స్త్రీలను ఆలింగన చుంబన సంభోగములు, సల్పువాడు రౌరవాది నరకములలో పడును. మాలో ననేకులు లింగములేని స్త్రీలతో గూడుచు, నన్నిసుఖము లనుభవించుచున్నారు. మతము చెడిపోయినది, గాన ప్రాయశ్చిత్తములున్ను పోయినవి.

ధర్మపాలుడు.

స్వామీ! మతమెప్పటికిని చెడదు. చెడినది మతమేకాదు. అసలుమతమే చెడినదిగా నున్నది. మీరింతకు మునుపు, లింగము—వీభూతి—రుద్రాక్ష ధారణవలనను, లింగార్చన—నైవేద్య దీపారాధన—నమస్కారములు మొదలగు వానివలన, సర్వపాపములు నశించి మోక్షము కలుగునని చెప్పి, మరల యీ భ్రష్టత్వకారణ శ్లోకములుచెప్పి, మొదటి సిద్ధాంతము లన్నొక్కొక్కదానిని, క్రమముగా ఖండించి, స్వోక్తి వ్యాఘాత దోషమును, మీమతమునందు స్పష్టముగ నగుపరచితిరి, మోక్షము

నకు జడపదార్థములు కారణములని మరియు సాధ
నములని చెప్పితిరిగాని గుణకర్మ స్వభావములు
మోక్షదాయకములని నితాంతముగ చెప్పకైతిరి.

## విద్యాలంకారుడు.

ఈ మతము మిగుల భ్రమ ప్రమాదయుక్తమై
నదనుటకు నేనొక యుదాహరణ మిచ్చుచున్నా
డను. వేదవేత్తయు నీశ్వరభక్తుడునగు నందీశ్వరు
ని గురించి వ్యాసులువారు యోగభాష్యమందు
"నందీశ్వరః కుమారో మనుష్యపరిణామంహిత్వా
దేవత్వేన పరిణతః" అని యీశ్వరభక్తుండగు
నందీశ్వరుడు తపోబలముచేత మానుషత్వమునుం
డి దేవత్వమును అర్థాత్ దైవీసంపదను బొందెనని
(వ్రాయబడి) విస్పష్టముగ తెలుపుచు, నందీశ్వరు
డు మానవోత్తముడని చెప్పియుండగా, లింగధారి
మతము ఆ మహాత్ముని తోకయు కొమ్ములును
గలిగిన పశువని, యొకనికి వాహనమని, అతడు
బసవేశ్వరుడై జన్మించి, యీమతమును స్థాపించె

నని చాటించుచున్నది. మరియు హిమవత్పర్వత సమీపమందలి శివాలిక్ పర్వతప్రాంత్యములకధిపతియగు, పార్వతేశ్వరరాజును, పరమేశ్వరుడని, అతనిసతి పార్వతిని భగవంతునిభార్యయని, చెప్పుచున్నారు. పర్వతప్రదేశములలో రథప్రచారము అనుకూలముకాదు గావున నతడెద్దుమీద తిరుగుచుండువాడు. ఆయెద్దును, నందీశ్వరుడని చెప్ప సాహసించినది. యిట్టి గప్పాష్టక సాంప్రదాయములు ప్రబలి పోయినవి. ఇది మిగుల దౌర్భాగ్యమని నా యభిప్రాయము.

## భారతరాజు.

ఈ మతస్థులు వేదవాక్యములని జనులు భ్రమించునట్లుగా కల్పిత మంత్రములనేకములు తమగ్రంథములలో వ్రాసిరి. నిజమైన మంత్రముల కర్థము చేయుటలో అష్టాధ్యాయనిరుక్తము మహాభాష్యముల ప్రకారము చేయక, మన్నానిగా వ్రాసిపెట్టిరి. 28 శైవాగమములున్న అథర్వ

శిఖాది యుపనిషత్తులున్ను, స్కాందాది పురాణ ములున్ను వీరశైవమత సారసంగ్రహాది చిల్లరగ్రంథములనేకములు కల్పించిరి. అందు " సోమఃపవతే జనితా మతీనాం " " ఋగిత్యాః పవిత్రంతే " " అఘోరాపాకాశీతి " బ్రహ్మేతిలింగ మాఖ్యాతం " అహమేవ పరబ్రహ్మ " ఆదావ్యోమ్నిస్థితోభాతి " ఇత్యాది కల్పిత మంత్రములు వ్రాసి, వేదవాక్యములని లోకులను భ్రమింప జేసిరి. వీర శైవాన్వయ చంద్రికలో (19 Page.) యాతే రుద్రశివా తనూర ఘోరాఽపాపకాశినీ తయా నస్తన్వాశంతమయా గిరిశంతాభిచాకశీహి" యను యజుర్వేద మంత్రమునకు భాష్యములో " శిక్షకాః శిష్యేభ్యః ధర్మ్యాంనీతి శిక్షిత్వా నిష్పాపాన్ కల్యాణాచరణాన్ సంపాదయంతు " అనగా గురువులు తమ శిష్యులకు నీతిశిక్షను బోధించి పాపమునుండి దూరముచేయవలెనను నర్థముండగా, దానికి నీశ్వరుని దేహము లింగరూపమనియును, దానిని మరణపర్యంతము ధరించవలెనని యర్థము వ్రాసినారు. వేదమందీశ్వరుడజరుడ మరుడరూ

పుడవ్యయుడ నంతుడని యుండగా, మీరు లింగరూ పుడని వ్రాసిరి. నాకు తోచినంతమట్టునకు లిం గధారిమతము భ్రమప్రమాదమైనదని తేలుచున్నది.

బసవయ్య.

“ శివయేవహిలింగంచ లింగరూపీ శివస్స్వయం” అనగా శివుడే లింగం—లింగమే శివుడని తాత్పర్య ము. మామతగ్రంథములిట్లు చెప్పుచున్నవి. “వే దళ్శివో శివోవేదః ” అనియుగలదు.

విదూషకుడు.

ఈ సిద్ధాంతము “ పీరఖుదాహై ఔర్ ఖుదా భీ పీరహై ” అన్నట్లున్నది.

బసవయ్య.

సభ్యులారా! మామతగ్రంథములో నీశ్వరుడి ట్లు చెప్పియున్నాడు, “ అనేనసదృశం ధర్మనప స్యామిషడానన । వేదమంత్రపురాణేషు సత్యం స

త్యం మదోదితం ” ఇట్టి సత్య మతమును మేము నమ్ముచున్నాము.

విదూషకుడు.

ఈశ్వరుడు నిజమే చెప్పినాడు. “ ఆరుముఖ ములు గలవాడా ! దీనితో సమానమైనమత ము వేదశాస్త్రపురాణములలో నెచ్చటను లేదు. “ నిజము నిజము ముమ్మాటికి నిజము ” అని ప లికినాడు. వేదాది గ్రంథములలో నీ తరహాగల మతమెన్ని దివిటీలు పట్టి వేదకినను లేదు. ఇది స త్యమని నేనును ధారాళముగ చెప్పుచున్నాను.

సభాధ్యక్షుడగు మహారాజా! ఈమత లక్షణ మీలాగున్నది వినుండు. ఒక మనుష్యుని కాళ్లు చేతులు వీపునజేర్చి పట్టుకొని జుట్టు వెంట్రుకల తో కట్టి బిగించి, బంధించి, తరువాత కోటుపాయి జామాలుదొడిగించి, తలకు రుమాలు జుట్టి పెట్టి, కుర్చీమీద గూర్చుండబెట్టి నట్లున్నది. సభ్యుల లో నవరికైన బోధపడుకున్న యెడల నేజెప్పినట్లు చేసి చూచినప్పుడు, విస్పష్టమగును. ఈ యద్భు

తమైన మతమ్మును, దేవుడుపదేశించగా, పండ్రెండు చెవులు గలవాడు విన్నవాడు. గనుక నిది రెండు చెవులుగలవారు-గ్రహించుట మహా దుస్తరము. మూగివాడు చెప్పగా చెవిటి వినవలెను.

## ధర్మపాలుడు.

ఈ మతగ్రంథములలో నెచ్చటచూచినను-ప్రాణలింగ-యిష్టలింగ-భావలింగ ములని గలవుగాని రాతి లింగమును గురించి చెప్పబడలేదు. మరి యు-ప్రాణ-యిష్ట-భావ-- శబ్దముల మూటికిని-శిల-యని అర్థములేదు. గనుక నిందులో, కల్పితాచారములు స్థాపింపబడినవని సమితము, బోధయగుచున్నది. మరియు " శివభక్తస్సదాపూజ్య శ్వపచో బ్రాహ్మణోత్తమః......శివసంస్కారసంపన్న జాతిభేదం నకారయేత్ " ఇత్యాది మతసిద్ధాంతములు లింగాయతులు బొత్తిగా పాటింపక వారిలో నానావిధ భేదములు కల్పించుకొనియున్నవారు. గనుక పుచ్చినదానిలో పురుగులు పడినట్లు ప్రవర్తకులు దీనిని మరింతపాడుచేసి యున్నారు.

రాజు.

క్రయిస్తవ మత గ్రంథమగు బైబిలులో " ఆవు యొక్క (పేడను కాల్చిన) బూడిదె దేహమునకు తగిలిన, పాపములు పరిహారమగుననియు, శుద్ధి కలుగుననియు నున్నది. (హెబ్రీ 9-13) లింగధారిమతము మకార రహితమైన శాక్తేయమని సత్యార్థ ప్రకాశములో నున్నది. వీనిని బట్టి యోచించగా నిది, యనేక పరివర్తనములతో గూడిన కల్పితమని తెలియుచున్నది. ఇంక వైష్ణవ విద్వాంసులు ప్రసంగ మారంభింప వచ్చును.

అపుయూపపు వైష్ణవుడు

సభాసదులారా! నేను శ్రీవైష్ణవమును ధరించి సరిగా, అరదినము, నారుగంటలు, యిరువది నిమషములు, పది సెకండ్లు అయినది. నా స్వానుభవమును మీకు విన్నవింతును సావధానులైవిన వేడుచునా్నడను.

పాట. శంకరాభరణము.

ఒక్కటి వేసిన నాలుగువచ్చును లక్కా ముష్టి
యిది చూడండీ । దక్కిన ధనముల పెట్టెల లోప
ల—దాచిన ఫలమేముండండీ ॥

మొండైన యిస్పేటు మూడాకు లాటలు మీనా
పు సరిబేసు లాడండీ—దండిది వాలాదీపముంచుట
కు-దివ్యమైన యాటలివిగోండీ ॥ ॥౧॥

ఉంగరమాటయు హెడ్డాట గుంతాట రంగాట
దరకాస్తు లాడండీ—లంగోటీ బైరాగులగుటకు మే
లైన దొంగలగుటకును మేలండీ ॥ ॥౨॥

వేగమె పోకుగ వెళ్ళి తలుపుతట్టి భోగము దా
నిని లేపండీ-త్యాగులై ధనదాన మర్పించి సంతోష
భోగముల్ యోగముల్ పొందండీ ॥ ॥౩॥

కష్టము లేకనె కూటికి జరుగును కడతేరు మా
ర్గములనుకోండీ—దుష్టులు భ్రష్ట పాపిష్టులు నగుట
కు శ్రేష్ఠములైనవి చూడండీ ॥ ॥౪॥

చాలక పోయిన సందూకముల్ దెరచి మేలైన
నగలన్నీ దీయండీ—ఆలి కంఠములోని తాళిని తీ

న్నగ జాలముఁ జేసియు ద్రెంపండీ ॥ ॥౫॥

జంభాలు గింభాలు ముగిసినపిమ్మట అంబలిలేక ను జావండీ—దొంబరి దాసరి వేషము ధరియించి తంబూరు మీటుచు వెళ్ళండీ ॥ ॥౬॥

సరియైన నామాలు ధరియించి వీధిలో తిరుగు చు పాటలు పాడండీ—శిరివిష్ణు మతమును శీఘ్రి మే వచ్చును చింతలింకేలను విడువండీ ॥. ॥౭॥

మహారాజా! వైష్ణవ మతములో నాబోటివా రు లెక్కలేనంతమంది స్వయం విష్ణువులున్నారు. ధర్మరాజు, నలమహారాజు మొదలగువారు మొద ట నానలెనె జూదమాడి తరువాత వైష్ణవులైనారు. ఇప్పటి పరమ భాగవతోత్తములందు పెక్కుమంది రాస క్రీలా వినోదములలో నుండువారే......

రాజు.

అయ్యా కూర్చుండ వలయును. మీరు చెప్పి నది కొంతవఱకు నిజమేయని యంగీకరించు చున్నా ను. ధర్మపాలా!

పాట. ఝుంఝూటి.

ఏమిజేయ లేనిదాయ— నెంత సులభమాయా?
స్వామి దెలియవలెనుగాని— సకలజనులమాయ ॥

దొంగయైన భంగుద్రాగిన, లింగమున్న చాలుౘ।
పంగనామమ్ములున్న జాలు—అంగముద్రచాలుౘ ॥౧॥

చోరులైన, జారులైన, దారమున్న జాలుౘ।
ఘోరపాతకు— లైనగాని, పారులనినజాలుౘ ॥౨॥

తులువలైన పలువలైన తులసిసరులుచాలుౘ।
ఛలము కపటమున్న నేమి కులము పేరుచాలుౘ ॥౩॥

జూదమాడిన క్రూరుడైన, బూదిపూతచాలుౘ।
సాదరంబులేకయున్న — సాంబయనినజాలుౘ ॥౪॥

జీవహింసజేయనేమి, దేవుడనిన జాలుౘ। భా
వశుద్ధిలేకయున్న—బ్రోవుమనినజాలుౘ ॥౫॥

నీతిలేక యున్న నేమి, రాతిపూజచాలుౘ। పా
తకములు జేయనేమి—పూతలున్నజాలుౘ ॥౬॥

జ్ఞానమేమిలేక యున్న స్నానమున్న జాలుౘ।
దీనులయెడప్రేమయేల మౌనమున్న జాలుౘ ॥౭॥

భ్రష్టపనుల జేసితేమి, బొట్టులున్న జాలునా ।
దుష్టమార్గమున్న నేమి - వట్టిజపము చాలునా ॥౮॥

మిత్రమా! మనుష్యుని ప్రవృత్తి యెంత వికటించి పోయినది. వాడు భుజించుట క్షుధానివృత్తి కెంతమాత్రముకాదు; మరేమన్న మత్తుమజాదుల నిమిత్తమై మద్యమాంసాదులు కోరుచున్నాడు. గుడ్డలు దేహారోగ్యమునకుగాక యలంకారమును జూపుటకై ధరించుచున్నాడు. ధర్మపాలనము నిమిత్తమై పూర్వులేర్పరచిన సాంకేతికములు అసలు ధర్మములై పోయినవి. ఒంటి జందెమును ధరించిన ప్రతివాడును నేను బ్రహ్మచారినని చెప్పుకొనుచు తన యజ్ఞోపవీతమును జూపుచున్నాడు. సాయంకాలమైనతోడనే వేశ్యయో అథవా కులట స్త్రీయొక్కయో - పాదసేవనకు వెళ్లుచున్నాడు. అందరును మాకు వైదిక ధర్మములు కావలెనని గోరుచున్నారు. కాని వేదధర్మమేది యని ప్రశ్న వేయగా, నిరుత్తరులగుచున్నవారు. కృతఘ్నులకు, జారులకు, చోరులకు, హింసకులకు, మాం

సభక్షకులకు, మద్యపానులకు, పరదార పరధనా పహారులకు, నన్యాయపరులకు, వేదధర్మములు కావలయునా? తప్పుకొలతలు, తప్పుతూనికెలు? టక్కు టమారకములు, మోసములు, కుటిలత, దుర్వ్యర్తత, లుబ్ధత, అశాంతత, మూర్ఖత, పరాయణత, అన్నవిక్రయత, దుష్టత, నీచత, మత మతాంతర పరిభ్రాంతత మొదలగునవి, వేదధర్మము లను కొనియున్నవారు కాబోలు? వేదమందు పుత్రీ విక్రయము, శిశుఘాతకము, ఛల, కపట, పక్షపాత, ద్వేషాసూయ, దురభిమాన, దురహంకారములు గ లవా? లంచముతినుట, కూటసాక్ష్యముచెప్పుట, కు లటలంగూడుట, మొదలగునవి వేదధర్మములా? ఏ దివేదోక్తము? ఏది వైదిక ధర్మము? మంచిది చూ తము! వైష్ణవ పండితులు ప్రసంగించ వచ్చును.

పుండరీకాచార్యులు.

పాట. కేదారగౌళ

ఓంకారనామ! సుగుణధామ-వేదవినుత ॥ఓం॥

ఆది మధ్యాంతరహిత! అఖిలజగత్పాలక! పిత!

సాధు సకలసజ్జననుత! సచ్చిదానందరూప॥ఓం॥ ౧॥

నిత్య శుద్ధ బుద్ధ ముక్త! నిర్వికార! సర్వశక్త! సత్యరూప ఆగమోక్త-సర్వాధి దేవదేవ ॥ఓ!! ౨॥

ప్రాణపతే! ప్రాణపితా! ప్రాణప్రియ! ప్రాణాధార!–ప్రాణజీవన! పరమాత్మా! –ప్రాణరక్ష! పాపశిక్ష ॥ఓ॥ ॥౩॥

ఆర్యపుత్రా! మామతమందు శ్రీకృష్ణుడు దేవుడని భావింప బడుచున్నాడు. "వామే యస్య స్థితా రాధా శ్రీశ్చ యస్యాస్తి వక్షసి। వైకుంఠవాసనిరతం శ్రీకృష్ణం హృది చింతయే ॥" వైకుంఠమందెల్లప్పుడు నెడమభాగమందు రాధయు, వక్షస్థలమందు లక్ష్మియు గలిగియుండు శ్రీకృష్ణుని ధ్యానించ వలయును.

విద్యాలంకారుడు.

"సపర్యగాచ్ఛుక్రమకాయ మవ్రణమస్నావిరగ్ంశుద్ధమపాపవిద్ధం" ఇత్యాది వేదప్రమాణముల చొప్పున నీశ్వరుడు సర్వవ్యాపకుడును, శరీరఛిద్ర

నాద్యాది రహితుడును, శుద్ధుడును, పాపరహితు డును, జన్మ మరణ దేహధారణ రహితుడని యుం డగా, చతుర్భుజములు, భార్యలు, యేకదేశీయము గు వైకుంఠస్థానములు గలవాడు, మానవమాత్రుం డగును గాని దేవుడు గానేరడు. కృష్ణుడు శరీర ధారియు, సంసారియునైయుండి, ద్వారకానగర స మీపమున మృతినొందెను. గనుక కృష్ణుడు భ గవంతుడని చెప్పరాదు. అతడు లోకోపకార పు రుషుడు గనుక, నతనికి, బిరుదు నామమగు దేవ శబ్దము వాడబడుచుండినది.

విదూషకుడు.

ప్రథమకబళే మక్షికాభక్షణ మన్నట్లాయ. సభ్యులారా! అంతయు మిథ్యయను నద్వైతమును వింటిమి. ముల్లాఅల్లాహై అను మసల్మానీమ జవాబ్ ఆలకించితిమి. జంగమో జగదీశ్వరః అ ను లింగాంగమును వింటిమి. ఇప్పుడు బ్రాహ్మ ణో మమదైవతం వచ్చియున్నది. శ్రద్ధతో గమ వలెను.

## పుండరీకాచార్యుడు.

“ కృష్ణదీక్షాగురోః ప్రాప్త్యై తులసీ మాలికే గళే! ధార్యే నిత్యంచోర్ధ్వపుండ్ర-లలాటాదౌ ద్విజాతిభిః ” వైష్ణవుడు కంఠమందు తులసిమాలయు, లలాటమందూర్ధ్వ నామములు ధరించవలయును. “ శైలీవాధాతుజామూర్తిః సాలిగ్రామోర్చ్యఏవతైః । ద్రవ్యైర్యథాప్తైః కృష్ణస్య జప్యోథాష్టాక్షరోమనుః ” అన్నట్లు మాలో మూర్తిపూజముఖ్యమైనది. మాలో సర్వజాతులవారును చేరవచ్చును. “ కిరాత హూణాంధ్రపుళిందపుల్కసా-ఆభీరకంకాయవనా ఖసాదయః । యేన్యేచ పాపాయ దుపాశ్రయాః శుధ్యంతి తస్మై ప్రభవిష్ణవే నమః ” (భాగ) అను ప్రమాణముచొప్పున మాలో మేదరవాడగు శఠగోపాచార్యులును, మహమ్మదీయుడగు- యామునాచార్యులును, అంత్యజులగు ఆళ్వారాదులును, చేరియున్నవారు.

## ధర్మపాలుడు.

కసాయి కిరాతాదిమ్లేచ్ఛులుమీలో చేరుటకు, వారి గుణకర్మస్వభావములు ముఖ్యమా? లేక తుల సీమాలలు, నామములు, ధరించి, మూర్తిపూజను జరిపినజాలునా? గుణము ముఖ్యమని యెదలేని, నామములు- మాలలు- పూజలతో ప్రయోజనమే మి? ఇవియే ముఖ్యమైనచో- యిప్పుడెందుకు అం దరిని చేర్చుకొనకూడదు? అట్లు చేయరుగనుక మీకుసిద్ధాంతహాని కలుగలేదా? అప్పుడు మతభ్ర ష్టత చేసూరెనుగదా?

## పుండరీకాచార్యుడు.

"నిజ వృత్త్యుద్యమప్రాప్త ధనధాన్యాదితశ్చతైః। అర్హోప్యబ్దదశాంశః కృష్ణాయ వింశాంశస్త్వహో దు ర్బలైః" అను ప్రమాణమురీతిగా వైష్ణవులు, ధనవంతులు తమ ధనధాన్యాదులలో పదింట నొక పాలును, బీదలిరువదింట నొకపాలును, కృష్ణున కర్పించిన యెడల, సమస్త దోషములు నివారణ మగును.

ధర్మపాలుడు.

ఈ ధనహారణము చేయుటకు కృష్ణుడు కేవలము దరిద్రుడా? అథవా యిది ముక్తియొక్క క్రియయా? నాప్రశ్నలకీ సమాధానము సరిగా నుండలేదు. సమాధానములో శంకోదయములుండరాదు.

విదూషకుడు.

అడియేఁ స్వామీ అడియేఁ! నేను విదూషకుడను. నా మాటలకు కోపము జేయగూడదు. "అధోపుండ్రం పార్శ్వపుండ్రం లలాటే యస్య దృశ్యతే। సచాండాలోపి శుద్ధాత్మా పూజ్య యేవ నసంశయః" యిది సిద్ధాంతమగునా కాదా?

పుండరీకాచార్యుడు.

మాకు సిద్ధాంత మెప్పటికిని కానేరదు. లింగమునకు పార్శ్వపుండ్రము గలదు. అందువల్లనే మేము శివదర్శనము చేసినయెడల ప్రాయశ్చిత్తము చేసుకొందుము.

## బసవయ్య.

కైలాస వాసియు, సుఖరాశియు, నవినాశియు, నగుపరమేశుని దర్శనమును, మహాపాతకముగా దలంచుట, పాషండముగా నున్నది. కాశీగిరిస్వాములిందుచేతగాబోలు మిమ్ములనుగురించి, ఇట్లుచెప్పియున్నారు. "మాతర్దక్షిణదేశే బహవపశవో మయాదృష్టాః। మృణ్మయశృంగాః పశుపతి విముఖాశ్చక్ర త్రిశూలై దగ్ధాంగాః" అనగా దక్షిణదేశమందు మట్టికొమ్ములుగలిగియు చక్రాములచే కాల్చబడిన అంగములుగల వింతయైన పశువులను నేను చూచినానని తాత్పర్యము.

## ప్రపన్న రంగరామానుజులు.

అరేమూర్ఖా! వినము! "వాసుదేవం పరిత్యజ్య యోన్యం దేవముపాసతే। తృషితోజాహ్నవీతీరే కూపంఖనతి దుర్మతి" యన వినవా? వాసుదేవుని విడిచి యన్యునిగొల్చువాడు పరమమూఢుడు.

బసవయ్య.

నీవెవరో నీకు తెలియదు. "విభూతిర్యస్యనో ఫాలే నాంగేరుద్రాక్షధారణం । నాస్యే శివమయీ వాణీ తంత్యజేదంత్య జంయథా" అను ప్రమాణము చొప్పున మీరు చండాలులు.

ప్రపన్న రంగరామానుజులు.

ఓ దురాగ్రహుడా! విను! " ఊర్ధ్వపుండ్రవిహీనస్య స్మశాన సదృశం ముఖం అవలోక్యముఖం తేషా మాదిత్యమవలోకయేత్ " " బ్రాహ్మణః కులజోవిద్వాన్ భస్మధారీభవేద్యది వర్జయేత్తాదృశం దేవి మద్యోచ్ఛిష్టం ఘటంయథా " అన్నట్లు మీముఖము లెంగిలికల్లు ముంతలు. సర్వజ్ఞమూర్తి–మిమ్ములను మాదిగెలనియును భ్రష్టులనియును స్పష్టముగ జెప్పియున్నాడు.

బసవయ్య.

అయ్యా! శాంతముతో వినుము! " సంప్రదా

య విహీనాయే మంత్రాస్తే నిష్ఫలామతాః। అతః కలౌ భవిష్యంతి చత్వారః సంప్రదాయినః। శ్రీమాధ్వీరుద్రసనకాః వైష్ణవాః క్షితిపావనాః చత్వారస్తే కలీదేవి సంప్రదాయ ప్రవర్తకాః ॥" అని మీ వైష్ణవసాంప్రదాయములు నాలుగున్ను కల్పితము లనినా స్తికములని వ్యాసులవారు చెప్పియున్నారు.

ప్రపన్న రంగరామానుజులు.

అదే వ్యాస మహర్షులేమి చెప్పియున్నారో వినుము! "యేకంఠలగ్న తులసీ నలినాక్షమాలాః॥ యేద్వాదశాంగ హరినామ రతోర్ధ్వపుండ్రాః। యేకృష్ణభక్తిసుదృఢాః ధృతశంఖచక్రాః। తేవైష్ణవా భువన మాశు పవిత్రయంతీ ॥ యేమృత్తికాం ద్వారవతీ సముద్భవాం। కరేసమాదాయ లలాటపట్టే। కరోతినిత్యం త్వథచోర్ధ్వపుండ్రం। క్రియాఫలం కోటిగుణంసదాభవేత్ ॥ ఆదాయ పరమా భక్త్యా వేంకటాద్రేర్శ్మృదోమృదం। ధారయేదూర్ధ్వపుండ్రాణి హరిసాలోక్య సిద్ధయే। యదూర్ధ్వపుండ్రం తిలకం శోభనంతం మనోహరం। తస్మ

ధ్యపీత రేఖంచ శ్రీమద్రామానుజం విదుః ॥ శంఖచ
క్రోర్ధ్వపుండ్రాదిరహితం బ్రాహ్మణాధమం గర్దభే
తు సమారోప్య రాజా రాష్ట్రాత్ప్రవాసయేత్ ॥ నా
రాయణాయుధైర్నిత్యం చిహ్నితం యస్యవిగ్రహం।
పాపకోటిప్రయుక్తస్య తస్యం కింకురు తేయమః ॥ ”
ఇత్యాద్యనేక ప్రమాణములు మాపక్షముగాగలవు.
నిజముగా రాజు మిమ్ములను గాడిదెలపై నెక్కించి
దేశభ్రష్టుల జేయవలయును.

బసవయ్య.

మీరుచు వినవలయును. “ యస్తు సంతప్త
శంఖాది లింగచిహ్నధరోనరః । ససర్వయాతనాభోగీ
చాండాలోజన్మకోటిషు ॥ బ్రహ్మణేయదిమోహేన
తాపయే ద్విహ్నిముద్రయా । నకర్మార్హో భవేదత్ర
సర్వేపాఖండసంజ్ఞకః ॥ చేదేషు యజ్ఞభాగేషు
యస్యానాస్త్యధికారితా । సతాపయిత్వాచక్రాదీన్
ధారయేద్ద్విభుజద్వయే ॥ తద్విజం తప్తశంఖాది లిం
గాంకిత తనుంహర । సంభాష్యరౌరవం యాంతి
యావదింద్రాశ్చతుర్దశ ॥ యిత్యాద్యనేక సిద్ధాంత

ముల ప్రకారము మీరు మహాపాతకులునాస్తికులు.

విదూషకుడు.

సభ్యులారా! వీరిద్దరును గలసి వీభూతిబూయని వారినిన్ని, నామములు బెట్టని వారినిన్ని, చండాలులని, నాస్తికులని, పాఖండులని, నరకగామినుల ని, తిట్టుచు చండాల సహస్రనామావళిని ప్రయోగించిరి. దీనికెవరును బదులుచెప్పరా?

విద్యాలంకారుడు.

వారిని వీరు, వీరిని వారు, తిట్టుకొని యుభయులును చండాలురైరిగాని, సభవారికేమియు లోపములేదు. "యథాస్మశాన జంకాష్టం సర్వకర్మ బహిష్కృతం। తథాచక్రాంకితోవిప్ర స్సర్వవర్ణబహిష్కృతం ॥" అన్నట్లు వారే చెడిరిగాని సభాసదులకేమియు కొరంతరానేరదు. సభ్యులకు మతమతాంతరముల యొక్క దుస్థితి బాగుగా విశదమయ్యెను. వీరిని చాలించుమనుట సమంచితమని

నా యభిప్రాయము. వీరుద్రేకించినచో అసభ్య చేష్టలు జరుగును.

విదూషకుడు.

పూర్వమీలాగే శైవ వైష్ణవులకు వివాదముపుట్టి, యొక గుడిసెయొక్క నిలువు స్తంభములను విష్ణుచిహ్నములని, అడ్డవాసములను శివచిహ్నములని వాదించి గుడిసెను పెరికి వేసిరి. అందుకు గ్రామాధికారి దెబ్బలశిక్ష విధించగా నెవరెక్కువదెబ్బలు కొట్టించుకొన్న, వారెక్కువ యనుకొని, నాకెక్కువదెబ్బలు కావలెనని శైవుడు, నాకెక్కువయని వైష్ణవుడు వాదించగా, యధికారి, యిద్దరికిని, వారే-చాలు ననువరకును కొట్టునట్లు విధించెను. గాని వారిలో నెవడును దెబ్బలు చాలు ననలేదు. చచ్చువరకును కొట్టబడిరి. అట్టి ప్రమాదమే యిప్పుడు కలుగునేమో-అయ్యలారా! మీరు శాంతించి కూర్చుండుడు.

రాజు.

ధర్మపాలా! చూడుము! యీయ విద్యాంధ కారమెట్లున్నది?

ధర్మపాలుడు.

క॥ అయ్యా యేమనిజెప్పుదు। కయ్యములును
ప్రబలి ధర్మకర్మమడంగెన్। వెయ్యింటికి నొ
క్కడులేడయ్యా నిజమెఱుంగువాఁడు యి
క్కాలమునన్ ॥

రాజేంద్రా! ఇందుకు కారణమేమి? వీరు మను ష్యులుకారా? వీరికి తెలివిలేదా? సత్యాన్వేషణ శక్తి వీరికి దేవుడియ్యలేదా? యథార్థస్వరూపము వీరికేల బోధకాకయున్నది?

విద్యాలంకారుడు

సచివా ధర్మపాలా! దీనికి కారణము విద్యయొ క్క ఆభాసముగా నున్నది. “ వేత్తియథావత్తత్వ

పదార్థస్వరూపం — యయాసావిద్యా " దేనివలన యథార్థము బోధయగునో దానికి విద్యయని పేరు. " విద్యాంచావిద్యాంచ యస్తద్వేదోభయంసహ। అవిద్యయామృత్యుం తీర్త్వా విద్యయా మృతమశ్నుతే " (ఈ-40-14) యేమనుష్యుడు విద్యావిద్యలను తెలియునో—వాడు అవిద్యాసంబంధమగు మృత్యువును తరించి, మోక్షమును పొందును. అట్టి విద్యాదేవి మనుష్యులలో, నివసింపక అరణ్యముల పాలైయున్నది.

పాట. శహనా.

విద్యాదేవి-మానసహృద్యాదాయీ- ఉద్యత్కర్మములకునీవే ఆద్యశ్రేణీ ॥

సత్యరూపా—నిహతా నిత్యపాపా—భృత్యజనుల కష్టములకు మృత్యురూపా ॥వి॥ ॥౧॥

దేవి మున్ను—పూర్ణభావానిన్ను —గావుమనెడు వాని రిపుడు గాననేను ॥వి॥ ॥౨॥

ఓ విద్యాదేవీ! నీవు మా దేశీయుల హృదయ

పీఠములందధి వసింపుము! భారతమధః పాతాళము నబడిపోయినది. దానిని యుద్ధరింపుము! ఓ దేవీ! నీవు నివసింపకున్న నీ ఘోరాంధకారము నాశనము కానేరదు. ఆహా! యేమిగతి?

ధర్మపాలుడు.

సభ్యులారా! ఇంతవరకు జరిగిన మతప్రసంగము లవలన పాపనివృత్తికిన్ని, పుణ్య ప్రాప్తికిన్ని, కొన్ని జడపదార్థములున్ను, కొన్ని స్తోత్రరూపమగు శబ్ద ములున్ను, కారణములని తెలియవచ్చినది. ఈ కారణము నిజమైన యెడల, లోకములో దుఃఖ మే యుండగూడదు. పాపముయొక్క ఫలమే దుః ఖమనుభవించుటయై యున్నది. పాపము నశించి నప్పుడు, దుఃఖమే యుండరాదు. అట్లుగాక జ నులు దుఃఖమధికముగ ననుభవించుచున్నవారు. “ అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం ” బను రీతిగా చేసినపాప ఫలమనుభవింపక తప్పదు. గనుక పాపము నశించు ననుట కేవలము కల్పి తముగా నున్నది.

రాజు.

మంచిది. అయ్యలారా! మన పాపములు నశించి యెక్కడఁబోవుచున్నవి? వాని ఫలములగు దుఃఖము లెవరనుభవింపవలయును? పరులకెవరికైన నౌెందునా? అథవా దేవుఁడే అనుభవించునా? పాతకముచేసిన వాఁడొకఁడుగానుండఁగా, ననుభవించువాఁడు మరియొకఁడుగా నుండుట, ఈశ్వరన్యాయమా? ఆహా! పాపము నశించిపోవునను అజ్ఞానమువలనను, మూఢ విశ్వాసము వలనను, లోకము చెడిపోవుచున్నది. గాన చేసిన పాపము అనుభవింపకనే, నాశనమగునను మతములు, నితాంతముగ యోగ్యములుగా నేరవు. అట్లు నమ్మకొన్నవానికి ముక్తిలేదు. సభ్యులలో నింతవరకుము గిసినవారుతప్ప మరొక సాంప్రదాయకులెవరైన ప్రసంగించ వచ్చును.

తరంగస్వామి.

పాట. శహనా.

గుప్తమైనదీ—మహా—గోప్యమైనదీ—ఆప్త శిష్యు
లకును వినా అబ్బనట్టిదీ (మహా) గు॥

యోగ్యమైనదీ—సదా—సౌఖ్యమైనదీ। భాగ్యవం
తులకును నిత్య భోగ్యమైనదీ (మహా) గు॥ ॥౧॥

చెప్పరానిదీ—బైట—విప్పరానిదీ। గొప్పవంశజుల
కునెల్ల జెప్పదగినదీ॥ (మహా) గు॥ ॥౨॥

మర్మమైనదీ—పర—బ్రహ్మమైనదీ। నిర్మలంబు
నిజ సుఖానుధర్మమైనదీ॥ (మహా) గు॥ ॥3॥

అందమైనదీ—పర—మానందమైనదీ। అందరెఱి
గి యెఱుగనంతరంగమైనదీ॥ (మహా) గు॥ ॥౪॥

బీజమైనదీ—యోగ—రాజమైనదీ। బీజమార్గమ
నబడునది భవ్యమైనదీ॥ (మహా) గు॥ ॥౫॥

సభ్యులారా! మా బీజమార్గ మతిగుప్తమైనది.
దీని నిటువంటి బాహ్యసభలలో వివరించిచెప్పుటకు

మా యాచారమను మతినియ్యదు. మాశిష్య మండలిలో నొకడుగా చేరువరకు నొక్కరికిని, దీని రహస్యము దెల్పజాలము. మా సిద్ధాంతము లి తరులకు నెంతమాత్ర మర్థముగానేరవు. అయి నను కొన్ని అనుష్ఠానములు శ్లోకరూపముననుం డువానిని వినిపించుచున్నాడను.

“ జకారో నీలవర్ణంచ జామాత్రు వరయోగి నాం। జా శబ్ద స్త్రీ జనో దేవ నిత్యానుష్ఠానఫలం భవేత్ ॥ ” ఇది నిత్యానుష్ఠాన సూత్రము. “సిద్ధ మూలిశ్రియా దేవి జ్ఞానబోధస్వరూపిణి। రాజా ప్ర జావశ్యకరీ కాలకంఠత్రిశూలినీ। ఐమాంస రుద్రూ పవేణి బోధయేత్స్వప్రసాదనం ॥ ” ఇది స్వప్రసాద సూత్రము.

“ రకారో అగ్నివర్ణంచ రక్తోనామకరోభవేత్। రహస్యశబ్ద రణో దేవ రక్తబిందు ప్రసాదనం ॥ ” ఇది బిందుప్రసాద సూత్రము. “ ఉకారో శ్వేత వర్ణంచ శుద్ధసత్వసమన్వితః। శిద్ధో పాయభవంత స్య శిద్ధసిధ్యతి యోగినాం ॥ ” ఇత్యాద్యనేక గు

ప్తసిద్ధాంతమ్ములు గలవు. మాలోనయితము జా
తిభేదములేక సమస్తజనులును చేరవచ్చును. అం
దుకు ప్రమాణము " స్వర్గాపవర్గసంపుణ్యాం శిష్యా
నాంచ సుఖప్రదం । ప్రాయశ్చిత్త విధిర్నైవ నచ
జాతిభయంక్వచిత్ ॥ " సభాసదులారా! యీవి
దూషకుడు పూర్వము మా అంతరంగసభికులలో
నొకడుగానుండిన మా శిష్యుడే. అతనికి మా
సాంప్రదాయముయొక్క మహిమ స్వానుభవము
గా నున్నది.

విదూషకుడు.

నమోన్నమో గురుస్వామీ! తాము దయ
చేసి యున్నారా! ఆహా! నేడెంత సుదినము?

పాట. జులాబు.

దరశనమాయెను - గురుపదచరణం । పరమా
మృత మార్గమే శరణం ॥
సురసంశేవిత-మైన ప్రమాణం । సరిలేనట్టి సు
స్వాకారం ॥ద॥ ॥౧॥

సధవ విధవ పథు, జనసముదాయం । విధ విధ రతి సుఖసారం ॥ద॥ ॥౨॥

మంత్రోక్తంబగు, కుంతల తైలం । తంత్రముకం తునిజాలం ॥ద॥ ॥౩॥

మదన మనోరథ, పూరణరాజం । సదమలమే హాప్రసాదం ॥ద॥ ॥౪॥

వింత భగంధర, శగ తెగయోగం । కాంతగనే రియా ప్రయోగం ॥ద॥ ॥౫॥

ఈగల దోమల, రాగవిలోలం । వాగడు వాక్ కరతాళం ॥ద॥ ॥౬॥

ఆకుల చామరం, అలదినదూరం । కాకకూజి తం కాకారం ॥ద॥ ॥౭॥

సర్వ వినాశం, సమవైరాగ్యం । గర్వవిహీన సన్యాసం ॥ద॥ ॥౮॥

గురుస్వామి! మన యనుష్ఠానములు విప్పి జెప్ప కున్న దాని నంగీకరించుటకు రాజుగారెట్లు సమ్మ తింతురు? గాన కొంతవరకైనను చెప్పవలయును. సజ్జనులారా! మా గురుమహిమను అల్పముగ జె

ష్టితినిగదా? గురుతీర్థమంత్రమును వినుఁడు “ఆది ధార పరబ్రహ్మ మధ్యధార రమాపతిః అంత్యధార మహాదేవ మూత్రపానంతు ముక్తిదం” ఇది స్త్రీ శిష్యులకు ముఖ్యముగ నుపదేశించు మంత్రము. ఈ సాంప్రదాయమం దుచ్ఛిష్టదోష మెంత మాత్రమునులేదు. ప్రమాణము వినుండు. “అస్యోచ్ఛిష్టస్యమాహాత్మ్యం కోబ్రూయాజ్జగతీతలే సహస్రాస్యోపినాగేశో నసమర్థో యస్యవర్ణనే। క్వాహం మందమతిః సూతః క్వేదం మాహాత్మ్యవర్ణనం” అనగా నీ యుచ్ఛిష్ట మహాత్మ్యమును వేయిముఖముల నాగేంద్రుడు వర్ణింప నేరడు; అని సూతులే చెప్పియున్నారు. ఇది మహా రహస్యమైన సాంప్రదాయము. ఇందు పంచ మకారసేవ నగూడ కలదు. “మద్యం మాంసంచ మత్స్యంచ ముద్రా మైథునమేవచ। మకార పంచకంచైవ మహాపాతకనాశనం” అను ప్రమాణము గలదుగదా? ఈ సాంప్రదాయకులందరును గురువుయొక్కయు తమయొక్కయు (కొన్ని ముఖ్యదినములలో) పంచ మలములను భక్షింప వలయును.

తరంగస్వామి.

విదూషకా! నీవు, బీజమార్గనియమోల్లంఘనముచేసి అనుష్ఠానములువిప్పి చెప్పుచున్నాడవు. ఇది ఘోరపాతకమని నీవు మరచిపోయి నట్లున్నది.

విదూషకుడు.

గురుస్వామీ! మనమెప్పటికిని గుప్తమును రక్షించవలసినది ధర్మమని జ్ఞాపకమున్నది. గనుకనే— ప్రతి కృష్ణపక్ష చతుర్దశీ—తిథినాడును, మనమాచరించు, అధః కేశార్చనం, భగార్చనం, భగలింగార్చనం, వీర్యోపాసనం, బిందుప్రసాదం, ఘటార్చనం, ఆసవప్రసాదం, సర్వసంగవిధి, పరిత్యాగం మొదలైన యాచరణ రహస్యములను గురించి చెప్పియున్నానా?

రాజు.

స్వామీ! మీరేల వివాదపడుచున్నారు? ఘీా

యశ్లీల యాచరణలను మేము విననొల్లము; గాన తాము గూర్చుండవలయును. ధర్మపాలా!

పాట. శంకరాభరణము.

అహహాయిదే- మతాభాసం। చూడు సత్యధర్మనాశం ॥ప॥

ఆది పరాత్పరునిమరచి—వేదధర్మ విధులవిడచి। యీ దోషదౌర్భాగ్యము — లిట్లు వెల్లివిరిసి వెలసె ॥అ॥ ॥౧॥

నిత్యసుఖా ధారమడఁగె—నిరుపమేశ నియమమణఁగె। సత్య విముఖమైన క్రూర—కృత్య కర్మపరత నెగడె ॥అ॥ ॥౨॥

శుద్ధ సనాతనమునీగి — ఒద్ద వైరములకులోఁగి। ఇద్ధరిత్రిబూటకముల — హద్దుమీరి పూర్ణమయ్యె ॥అ॥ ॥౩॥

ఏటిమతాంతరములివియొ — యేటి శీలవ్రతములివియొ। యేటి శీలవ్రతములివియొ యేటి యాచారంబులివియొ—బూటకంబులెల్ల జూడు ॥అ॥ ॥౪॥

లోకమున నీశ్వరదత్తమైన సూర్య చంద్రాగ్ని జల వాయు భూమ్యాకాశాదులు, సమస్త దేహ ధారులకును సమానమై లాభదాయకమై యున్న టులనే—ఈశ్వరీయ ధర్మంబును 'మనుష్యులకందరి కిని, అవిరోధమై, హితకారియై, లాభదాయకమై, నిర్దోషమై, నిర్భ్రాంతమై, నిష్పక్షపాతమై యుం డవలయును. వీనిలో నొక్కటియైనను సార్వభౌ మ ధర్మముగా నుండలేదు. అట్టి సత్యధర్మ మె చ్చటనున్నది? అది మనకు లభించు టెట్లు?

## ధర్మపాలుడు.

ప్రభువరా! సార్వభౌమ ధర్మ మెప్పటికిని యెవ రిచేతను ఖండింపబడక, సర్వప్రియమై, సదాచార యోగ్యమై, యుండవలయును. దాని యనుష్ఠా నమువలన, మానవమాత్రులందరికిని సుఖప్రాప్తి యు, దానిని పరిత్యజించుటవలన దుఃఖప్రాప్తియు

కలుగవలయును. ఇప్పుడు లోకము దుఃఖదావా నలమువలన దగ్ధమగుచున్నది. కారణమేమి? ఈ మత మతాంతర సాంప్రదాయకములు, మానవులచే నిర్మింపబడి. లోకమునకీ దుర్గతిచేకూడినది. వీనిని ధర్మములని, నమ్ముట–యాచరించుట–కేవల మజ్ఞానమేగాక, ఆత్మఘాతకమగుచున్నది. ఈపాతకమువలన లోకము మలినమై పోయినది.

రాజు.

సభ్యులారా! మరెవరైన సార్వదేశికమగు సత్యధర్మమును నిరూపించు వారున్నచో ప్రసంగించ వచ్చును.

దావీదు.

O God! my father in heaven, I thank Thee for to take care of me. O Lord bless my father and mother, brothers and sisters and every body, for the sake of Jesus christ. O God I Pray to forgive all I have done wrong and sin.

విదూషకుడు.

సభ్యులారా! దావీదుగారింగ్లీషున వాడుకప్ర కారము ప్రార్థించిరి. నేనును వారికి తోడుగ క్రీస్తును తెనుగున ప్రార్థించి, మీకుత్సాహము గలుగజేయుచున్నాడను.

ఇంగ్లీషు మెట్టు. (Note.)

శ్రీ యేసూ స్వామీకీ- చేయండీ ప్రార్థనలూ।
ఆయనమనపాపములూ-బాయగజేయును బదులూ॥
గాలికి బుట్టినవాడు-కర్ణుడు కుంతికివలెనే।
శూలము గ్రుచ్చగ బ్రదికెను-శుద్ధకమలునివలెనే॥
అంధులకును బధిరులకున్-అక్షులుచెవులను నిచ్చెన్। వంధ్యలకును సుతులనొసగె- హైందవ ధన్వంత్రివలెన్ ॥ ॥౨॥
చచ్చినవారిని లేపెన్-శుక్రాచార్యునివలెనే। తెచ్చిననాలుగురొట్టెల్-హెచ్చించెను వెయ్యారుల్॥
దేవుని సుతుడగు యేసున్ భావములోదలపవలెన్। యీవిధమునతడువినా - బ్రోవగలేరెవ్వారిలన్ ॥ ॥౪॥

దాపీదు.

సభానదులారా! విదూషకులు సత్యమే చెప్పి నారు. గాని క్రయిస్తునకును, కర్ణ ధన్వంత్రి శుక్రాచార్యులకును పోల్చినది మాత్రము సరికాదు. క్రియిస్తుకును వారికిని భేదముగలదు.

విదూషకుడు.

మతవిషయములో నెవరును అబద్ధము చెప్పరు గాని, కొందరికట్లు తోచును. పూర్వ మొకప్పుడి ద్దరు గుడ్డివాండ్రు నాటకము జూడబోయి, అంత యు ముగిసినతరువాత వచ్చుచుండగా, దారిలో నొక చెవిటివాడును కలసికొనెను. నేనంధులను జూచి నాటక మెట్లుండెనని యడుగగా వారు "నే డు సంగీతము మాత్రము పాడిరి. రేపు నాటక మాడుదురని" చెప్పిరి. చెవిటివానిని యడుగగా యీదినము నాట్యమాడిరి; రేపు సంగీతము పా డుదురని చెప్పెను. వారివారికదే సత్యమే. మత సాంప్రదాయపుమాట లీలాగేయుండును. గాన

వారసత్యము చెప్పిరని నేనప్పటికిని చెప్పను. నాకు తెలిసిన సంగతి పాదిరీగారికి దెలియదు. వారికి దెలిసిన సంగతి నాకు తెలియదు.

విద్యాలంకారుడు.

క్రీస్తువుయొక్క పుట్టుక ప్రత్యక్షాది ప్రమాణములకును సృష్టిక్రమమునకును విరుద్ధము గనుక విద్వాంసులెవరును నాతడు పురుషసంపర్కములేకుండ జన్మించినాడనుట నమ్మరు. ఆ విషయమట్లుండనిండు. ఇప్పుడు క్రీస్తువెచ్చట నున్నాడు?

దావీదు.

తన తండ్రియగు దేవునియొద్ద నున్నాడు.

విద్యాలంకారుడు.

దేవుడు బ్రతికియున్నవాడా? అథవా చనిపోయినాడా?

దావీదు.

బ్రతికియేయున్నాను; దేవుడెప్పటికిని చావడు.

విద్యాలంకారుడు.

దేవుడు బ్రతికియుండగా కొడుకున కేమియు హక్కుండదు. దేవుడు చనిపోయినతరువాత, యా తనిహక్కు, కుమారునకు గలుగును. అప్పుడు మనమేవిషయమందైనను క్షమాపణను అడుగుకొన వచ్చును. అతడివ్వగలడు. గనుక నిప్పుడు క్రయిస్తువు మోక్షమిప్పించునని చెప్పుట కేవలము మూర్ఖముగానున్నది మీరు తండ్రి కొడుకులకు కలహము కల్పించవలెనని యోచించినారాయేమి? ఇది పాపకార్యముగాదా?

దావీదు.

దేవుడే క్రీస్తువుగాని అన్యథా కాదు. గాన వారికి భేదములేదు. పాపములను క్షమించుటలో సమానాధికారము గలదు.

రాజు.

ఒకడు చేసినపాపమును క్షమించుటయనగా నర్థ మేమి? ఆ పాపశిక్షను యెవరనుభవింపవలయును? యెవరును అనుభవించునది లేదన్న దేవుడు న్యాయకారి యెట్లగును? ఒకడు కల్లుద్రాగినచో మరి యొకనికెట్లు మైకము కలుగును? గాన యొకని పాపముయొక్క ఫలమును, మరియొకడనుభవించుట యసంభవమగుచున్నది.

దావీదు.

మాలో విశ్వాసము ముఖ్యమైనది. ఆవగింజంత విశ్వాసమున్నయెడల, కొండనుజూచి "ఇచ్చటనుండి మరియొకచోటికి వెళ్ళుమన్న వెళ్ళును; విశ్వాసముగలవానికి అసాధ్యకార్యమే లేదు" అని చెప్పబడినది.

రాజు.

మీరు విశ్వాసముగలవారలైతే పర్వతములను

నడిపించి యుందురు. ఈ ప్రపంచమంతయు క్రై స్తవ మతమగునట్లు చేయగలిగియుందురు. మీ లో నేక్రియున్నను నమ్మరినాగున్నారు. రోమన్ క్యాతలిక్కులలో విగ్రహారాధననేల మాన్పజాలరు? కొండలు మీమాటలనువిని నడచినప్పుడు, మీ యందావగింజాత విశ్వాసమున్నదని నమ్మవచ్చును.

గావీదు

అచ్చట విశ్వాసముయొక్క ప్రభావమును అలంకారముగ వర్ణింపబడినదిగాని వేరుకాదు. హిందూగ్రంథములలో "యాదృశీభావనా యస్యసిద్ధిర్భవతి తాదృశీ" యన్నట్లు మాలోను ముఖ్యముగ భావనప్రకారము జరుగునని చెప్పబడినది.

ధర్మపాలుడు.

భావనయొక్క అర్థము మావారట్లు చెప్పరు. "ఎట్లుభావించిన నటువంటిసిద్ధి కలుగును" అనగా భావన గలుగువానికి మేలును, దుర్భావన గలుగువానికి కీడును, గలుగునని తాత్పర్యము. ఉదాహార

ణముగా—మిమ్ము నుకైలుగా భావించి, మీపైన గూర్చుండినయెడల, మీరు కైలువలె వెళ్ళగల రా? లేదు, మీరును పడిపోయెదరు; నన్నును పడవేయుదురు, దీనికి అభావమని పేరు. రాతిని రొట్టెయని భావించుటయు, రొట్టెను శిలయని భావించుటయు, అభావన; రొట్టెను రొట్టెయని యు, కట్టెను కట్టెయనియు, భావించుట భావన యనబడును.

విదూషకుడు.

నేనొకతూరి భావనరహస్యము తెలియని దోష ముచేత, రాజువద్దకు పోవుచుండి "నృపసమీపే రిక్తపాణిర్న గంతవ్యమ్" అను పెద్దలమాట జ్ఞాపక మువచ్చి, అప్పుడు నాచేత నేమియు నుండనందున నాపాదరక్షల రెంటినిదీసి చేతధరించి రాజసన్నిధికి బోతిని. రాజు చూచి, ముచ్చెలనెందుకు దెచ్చి తివని, కోపముతో బలికెను. నేనందుకు "రిక్త పాణిర్నగచ్ఛేత్" అని చెప్పితిని. సరే—నీవు ఫ లాదులు తేకుండ వీనినెట్లు దెచ్చితివని యాక్షేపిం

చెను. నేను "యాదృశీ భావనాయస్య సిద్ధిర్భవతి తాదృశీ" అని చెప్పితిని. రాజపుత్రుడు నాముడ్డి మీద నొకడజ్జ వాయించునట్లు చేసి, దీనిని బహుమానముగ భావించుకొని వెళ్లి పొమ్మనెను. ఇది నా భావనఫలము. ఇప్పుడనేకులు విగ్రహములను దేవుడని భావించుచు, మాకు మోక్షమనుకొన్నారు. వారు నరకమునకు వెళ్ళినప్పుడు, దానిని మోక్షమనుకొని యనుభవించవలయును.

దావీదు.

ఐతే హిందువులు సంధ్యావందనమును, మేము ప్రార్థనమును, ముసల్మానులు కల్మాను సలుపుచున్నారముగదా? ఇది పాపపరిహారముకొఱకు గాకమరెందుకు?

ధర్మపాలుడు.

సంధ్యకు పాపపరిహారము ఫలము కానేరదు. ఎప్పటికిని పాపముచేయకూడదన్న జ్ఞాపకముండుటకును, భగవంతుని ధ్యానము కుదురుటకును, సాధన

ముగాని అన్యథా మరేమియు లేదు. సంధ్య మోక్షముగానేరదు. పాపాత్ము డెన్నిసారులు సంధ్యవార్చినను ప్రయోజనము లేదు.

విదూషకుడు.

నాయనుభవము జెప్పుచున్నాను. నేను ముసల్మాన మతములో మూడు దినములుండినప్పుడు, నమాజు జేసితిని. అప్పుడు నాకు మంచి లాభము కలిగినది వంగునప్పుడు లేచునప్పుడు, అపానవాయువు మూడువిధములగు ధ్వనులతో బైట వచ్చుచుండెను. అప్పుడు సువాసన ద్రవ్యములు కాల్చుకున్నచో, ముక్కులోని వెంట్రుకలు మాడిపోవలసినదే సరి. నా కడుపుబ్బరము మాత్రము, తగ్గుచుండెడివి. సంధ్యావందనములో కాళ్లు తిమ్మిరిపట్టుచున్నవి. ప్రార్థనలో కొంతవఱకు తలనొప్పి శాంతమగుచున్నది. గనుక నన్నియు నించుమించు సరిపోవుచున్నవి.

ధర్మపాలుడు.

సంధ్యావందనములో పాపములు క్షమించుమనియైనను గాని, నాకు రొట్టెను దయచేయుమనిగాని, మరి యొక మధ్యవర్తిని శిఫారసును వేడుకొనుటగాని లేదు. అందు కేవలము దేవునకు కృతజ్ఞతను సమర్పించుట మాత్రము గలదు.

దావీదు.

మా మతమునందుగల సిద్ధాంతములలో నన్యాయ మేమియు లేదు. జడపదార్థములను మే మారాధింపము. ఏకేశ్వరోపాసకులము.

రాజు.

ఇది మాటమాత్రమై యున్నది. మీరును దేవుడు—దేవుని కుమారుడు— పరిశుద్ధాత్మయను త్రిమూర్తులను నమ్ముచున్నారు. మరియు నొక రూప్యము దొంగలించినవానికిన్ని, నిత్యశిక్ష విధించుటయు, కోటి రూప్యములు దొంగలించినవానికిని,

నిత్యశిక్ష విధించుటయు నెటువంటి న్యాయము.

దావీదు.

మేము పూర్వజన్మ పునర్జన్మముల నమ్మము. స్వర్గ నరకములు శాశ్వితముగా ననుభవించ వలయును.

రాజు.

పుణ్యముచేసినవారు స్వర్గమునకును, పాపాత్ము లు నరకమునకును పోయెదరు. పుణ్యపాపములు రెండును చేయనివారెక్కడికి పోయెదరు?

పూర్వజన్మములు లేకుండ క్రొత్తగా సృష్టింప బడిన మానవులందరును, సమానస్థితియందుండక కుంటి, గుడ్డి, కుష్ఠురోగి, ధనిక, దరిద్ర, మూర్ఖ తాది భేదములు గలుగుటకు కారణమేమి?

దావీదు.

ఈ జన్మవిషయము ప్రత్యక్షమైనది కాదు. ప్ర పంచములో మావారు మిక్కిలి బుద్ధిశాలులు.

వాహూహించి చెప్పునది యేమనగా—నీ భేదములు,
భగవంతుని మహిమను, వెల్లడిజేయుచున్నవి.

రాజు.

ఊహయనునది శాస్త్రోక్తముగాను ప్రమాణబద్ధముగా నుండవలయును. మీవారియూహ యీలాగుండలేదు.

విదూషకుడు.

పూర్వమొక దొరయు దొరసానియు మిద్దెపై పరుండియుండి, ఆకాశమును జూచుచుండగా, కొన్ని ఉల్కాపాతములు (చిన్న నక్షత్రములు పడుట) జూచి, దొరగారు “ ఆకాశమున కగ్నిపడి కాలుచున్నది ” యని చెప్పెను. అందుకు దొరసానియు నామోదించి, “ అవును పొగలు గ్రమ్ముచు లేచుచు పోవుచున్నవి చూడు ” మని మేఘములను జూపెను. దాని నెట్లయిన నార్పవలెనని యుభయులు యోచించి, తమ యధప్రదేశముల నూర్ధ్వముఖముచేసి, మూత్రమును విడిచిరి. మీ

త్రిము సరిగా ముఖములపై బడెను. అప్పుడు "ఆహా! ఆకాశమెంత వేడిగానున్నది? మూత్రముగూడ అత్యుష్ణమై వెచ్చబడిపోయినదని ఆశ్చర్యపడిరి." ఇట్టియూహాలతోడనే — క్రైస్తవ మత గ్రంథములు వ్రాసి యుండవచ్చును. లేనియెడల యేసును పిశాచి పరిక్షించినది, అతడు నలువది దినములుపవాసముండి బ్రదికినది, కట్టెలను పాములుగా మార్చినది. నాలుగురొట్టెలు యేడువేల మందికి పంచిపెట్టి యేడుగంపలను మిగిల్చినది, ఆతడు చచ్చి బ్రతికినది మొదలైన సంగతులెవరు చూచియున్నారు?

విద్యాలంకారుడు

మీ మతప్రకారము జీవుడు స్వతంత్రుడా పరతంత్రుడా? యే విషయమున స్వతంత్రుడు? యే విషయమునం దస్వతంత్రుడు?

దావీదు.

జీవుడన్ని విషయములందును పరతంత్రుడు.

యెట్లనగా దేవుడు చెప్పినాడు "నేను ఫిరోనుని హృదయమును కఠినముచేయుచున్నాను" యీమాటలవలన స్పష్టముగా జీవుడు స్వతంత్రుడుగాడు.

విద్యాలంకారుడు.

అట్లయిన జీవుడు పాపకార్యములు చేయునట్లు చేయువాడు దేవుడేగదా?

దావీదు.

సందేహమేమి? "కుమ్మరవానికి కుండలపైన అధికారములేదా? ఒకదానిని గౌరవమునకును, మరియొకదానిని యగౌరవమునకు నుపయోగించును" అని బైబిలులో చెప్పబడినది. అయితే క్రీస్తును విశ్వసించినవారికి మోక్షముగలదు.

విద్యాలంకారుడు.

క్రీస్తును విశ్వసించునట్లు చేయుపని దేవునిదికాదా? క్రయిస్తును నమ్ముటకుమాత్రము జీవునకు స్వతంత్రమిచ్చియున్నవాడా?—యేల బదు

లు చెప్పుటకు తడబడుచున్నారు? ఏమియు తోచ
దుకదా?

విదూషకుడు.

ఒక సిపాయి మిలిటెరి హోటలుకుపోయి, యొ
క పైసాకు రొట్టియు కూరయు నిమ్మనెను. వా
డును పైసాకు తగినంత యిచ్చెను. కూరలోనొక
యీగ పడియుండుట చూచి, యీగలు పడిన కూ
ర యిచ్చితివేమని యడిగెను. ఒకపైసా కూరలో
యీగలుగాక యేనుగులు పడియుండునా? యని
హోటలువాడు బదులుచెప్పెను. ఇది రొట్టికి-బ
ట్టకు-నరకమునకుగాను, అవలంబించిన మతముగా
ని, మోక్షముకొరకుగాదు; గనుక దానికదె తగిన
ట్లున్నది. దావీదుగారూ! మీమతములో నరక
మనగానేమి?

దావీదు.

నరకమనగా మహాంధకార మగునట్టియు, అగ్ని
యు గంధకముతో గలసి మండుచుండునట్టి స్థానము.

ధర్మపాలుడు.

నరకము మహాంధకారమని చెప్పి, అందులో న
గ్ని మండుచుండునంటిరే, అగ్ని మండుచుండగా
చీకటియెట్లుండును?

దావీదు.

ఈశ్వర క్రమమును ఆక్షేపింపరాదని మీశా
స్త్రములే చెప్పుచున్నవి.

ధర్మపాలుడు.

క్రియిస్తువు, ఈశ్వరక్రమములో పుట్టినవాడా?
సృష్టిక్రమములో పుట్టినవాడా? ఈశ్వర క్రమము
లో సృష్టిక్రమముగాని, సృష్టిక్రమములో నీశ్వర
క్రమముగాని యుండదుగదా? అతడు ఈశ్వరక్రమ
ములోని అయోనిసంభవుడుకాడు. సృష్టిక్రమ
ములో స్త్రీగర్భమందుత్పత్తియైనవాడు. ఆతనిని
పురుషవీర్యమునకుగాక, పరిశుద్ధాత్మకుబుట్టినవాడని
యెట్లు చెప్పుదురు? ఇప్పుడు, మీభార్య, మీతో

సంగమింపక, పూర్వము, గర్భవతిగానున్నదని, మీ
కు దెలిసినప్పుడు, మీరేమని తలంతురు? నిజముగా
వ్యభిచరించినదని నమ్ముదురు గదా? ఇట్లే క్రైస్తువు
నుగురించిన వ్రాతలన్నియు నబద్ధములనుటకు సందే
హమేమైనగలదా? మాలోను యిటువంటి కల్పితక
థలనేకములు ప్రబంధ పురాణాదులలో గలవుగాని,
విద్వాంసులెవరును నమ్మరు. గనుక క్రయిస్తవుని
జన్మమహిమ కేవలము గప్పాష్టకముగా నున్నది.
మీమతమునందు ఈశ్వరక్రమమునుగురించి యొక
యక్షరమైనను లేదు.

రాజు.

లోకవ్యవహారమంతయు, యే సాధుజంతువుల
వలన జరుపబడుచున్నదో, అట్టి జంతుహింసను అం
గీకరించుచు, చతుష్పాదజంతువులను, ప్రాణముండ
గా చర్మము లొలుచుచుండుట కన్నులారా చూచు
చు, దాని నాపకుండనుండు కఠిన హృదయములు
గలిగిన మతములు ధర్మయుక్తమైనవని యే మాన
వుడు చెప్పగలడు? "యక్షరక్షః పిశాచానాం

. మద్యం మాంసంసురాసవం " అన్నట్లు యే మత స్థులు మత్స్యమాంస సారాయాదులు సేవింతురో వారు, యక్షరాక్షస పిశాచులుగాని మానవులు గారు. ఇకమీాద నిట్టిదురాచారములు లేని మతాం తరులెవరైన ప్రసంగము చేయవచ్చును. క్రయిస్త వము సయితము అసంగతముసందగ్రహీతమునధిష్ఠిం చియున్నది. దావీదుగారూ ! తానూసనము స్వీక రింపవచ్చును.

జైనాచార్యుడు.

శహనరాగము.

ప్రాణులయెడ ప్రేమమానసమున నిల్పు - జైన ధర్మము జూడుడీ ! (సాదరమున) జైనధర్మము జూ డుడీ ! కాని హింసలజేసి కష్టము బెట్టని-ప్రాణదా నముకంటె పరము వేరుగలేని॥

సాధుజంతువులైన-బాధించునవియైన - భేదమెంచక బ్రోచుచు।ఆధీనముననుండు నన్ని జంతువులను-వేధించకను నిత్యమాదరమునుజూపు॥ ॥౧॥

పసిప్రాయమునగాని-పాడిదప్పినగాని-ముసలియై

నను గాచుచు ।, పనలేనిదైనను పనికిరాకున్నను,
వ్యసనమునియ్యక నశనముబెట్టుచు॥ ॥౨॥

జలమునందుండెడు-జంతువులనుగాని - స్థలమున
నాకాశతలమునంగాని । ఇలలో నెచ్చటనైన - నే
ప్రాణికైనను - వలసిన రక్షణ గలిగించి పోషించు॥

సభ్యులారా! మామతమందు "చిదచిద్వేపరే తత్వే వివేక స్తద్వివేచనం" అనగా చేతనము జడము నని రెండు తత్వములుగలవు. ఆరెంటియొక్క వివేచనమే-వివేకమనబడుచున్నది. ఈ జగత్తును సృష్టించుకర్త యొకడులేడు. జీవుడువినా రెండవచేతనుఁడగు నీశ్వరుఁడు సర్వథాలేడు. "సర్వమును జీవుని కర్మవలననే యగుచున్నది. ఇది యనాదికాలమునుండీ స్వభావముగా జరుగుచున్నది. దేవుడు జగత్తును సృష్టించి కర్మచేయుచున్నాడన్న కర్మఫలమును దేవుడనుభవింపవలసి వచ్చును. ముక్తజీవులందరును దేవతలగుదురు. వారికి తీర్థంకరులని చెప్పవచ్చును. ఉత్సర్పిణి అనగా వృద్ధికాలమున వృషభాది యిరువది ముగ్గురు తీర్థంకరులవత

రించిరి. ఇప్పటి అవసర్పిణి అథవా క్షీణకాలమున నిర్వాణాది యిరువది నలుగురు తీర్థంకరులవతరించ వలయును. ఇందు మొదటి తీర్థంకారులయొక్క యాయువు 8400000 సంవత్సరములు. తీర్థంకరు లందరును జీవులకు మోక్షసుఖమునిచ్చువారుగ నుందురు. ప్రపంచమును త్యజించుటయే మోక్షము.

రాజు.

మీరు పూజించునట్టి అర్హద్దేవుడెవరు? యాతని నివాసమెద్ది?

జైనాచార్యులు.

అర్హద్దేవుడశోకవృక్షముక్రింద సిద్ధశిలయందీశ్వరరూపుడై లోకమునందు తీర్థంకరరూపుడై యున్నాడు. అతడేకర్మను జేయడు.

రాజు.

౨.

ఈశ్వరుడును జీవులును వారివారి పనులు వారు

చేయుచున్నారు. వృక్ష సస్యాదులను దేవుడు సృష్టించగా జీవులు—వానిని స్వీకరించి నానావిధముల ననుకూలపరచుకొని యనుభవించుచున్నారు. జగత్తును సృష్టించుటకు జీవుడు, సమర్థుడు కానేరడు. జడమైనజగత్తు స్వయంసృష్టియగుట కేవల మసంభవము. ఈశ్వరుడు సదా ముక్తుడు. వాడు జీవులయొక్క కర్మములకుదగిన ఫలముల నివ్వవలయును. రాజు లేకుండ దుష్టమనుష్యులు తామే స్వయముగా శిక్షలననుభవించరు. గనుక దండవిధాయకుడు తప్పక కావలసియున్నది. జీవులందరును దేవతలైనచో పరలోకమున గొప్ప యుద్ధములు జరుగును. జగత్తు స్వయం సిద్ధమనుట నిజమైనయెడల జైనుల కడుపులోనికి రొట్టె మొదలగు పదార్థములు తమకుతామే తయారైపోయి ప్రవేశింపవలయును. అట్లులేదు గనుక నిదియసంగతము.

జైనాచార్యుడు.

ఈశ్వరుడు కర్తగానున్నప్పుడీశ్వరునకు కర్తయెవరు?

ధర్మపాలుడు.

కర్తకు కర్తయు కారణమునకు కారణమునుం డను. కర్త కారణములచేతనే కార్యమగుమ న్నది.

జైనాచార్యుడు.

జీవుడు పూర్వార్జిత ఫలముచేత శరీరధారణ చే యుచుండగా నీశ్వరుడెందుకు కర్మచేయవలయును? భంగుత్రాగినవానికి మైకము స్వయముగా గలుగు చున్నది.

ధర్మపాలుడు.

మదద్రవ్యాదులను హెచ్చుగా సేవించు యభ్యాస ముగలవారికనేకులకు మైకమ్ము కలుగనేకలుగదు. బాధయులేదు. అలవాటు లేనివారికిని అభ్యాస మల్పము గలవారికిమాత్ర మత్యధికముగ మైకము గలిగి బాధయు నెక్కువగున్నది. గనుక స్వయము గా ఫలానుభవమెప్పటికిని న్యాయము ననుసరించి

యుండదు. ఇందుకు న్యాయకర్త యొకడుండి యే తీరవలయును.

జైనాచార్యుడు.

పాలును పులుసును గలసిన పెరుగగునట్లు, జీవుడును, వానికర్మయును కలసి పరిణామమగును.

విద్యాలంకారుడు.

పాలును పులుసును రెండును తమకుతామే కలియవు. రెంటిని సంయోగము జేయువాడొకడు కావలసియుండును.

జైనాచార్యుడు.

మా మతమందు అహింసారూపమైన దయాగుణము ప్రధానమైనది గావున, దేవుడును పరమకరుణాళుడు—అతడు జీవులను దుఃఖమూలమున హింసించుచున్నాడనుట ఆతనిపేరు ప్రతిష్ఠలకుహాని గలుగునని ముఖ్యాభిప్రాయము. దేవుడు దయావంతుడని సర్వమానవులును సమ్మతించి యున్నారు.

## విద్యాలంకారుడు.

దుష్టులను క్షమించుట దయకానేరదు. అ ప్పుడీశ్వరుడు న్యాయకారి గాకపోయెను. ఒక దుష్టమానువుని క్షమించి విడిచినయెడల ననేకసా ధువులగు మానవులకు దుఃఖముకలిగి, వారి మా నధనప్రాణములకు హాని గలుగుచుండును. ఇది దయాగుణ పరిణామముగదా? జైనులు మేము దయగలవారమని చెప్పుకొనుట — లజ్జగానున్నది. జైనులు, అన్యమతస్థులను చంపి, ప్రాయశ్చిత్తము లు చేసికొని, పరిశుద్ధులమైతిమనుకొన్న మాత్ర మున దయావంతులు కాజాలరు. వివేకసారమును జూడుడు.

## విదూషకుడు.

జీవులు ప్రపంచమును త్యజించి భక్త్యాదులవలన దేవతలగుదురంటే—నాకొకటి జ్ఞాపకమొచ్చినది:—

మా ద్రాక్షతోటలో నేనొకనాడు కావలి యుండగా నొక జైనుడు ద్రాక్షపందిలిక్రిందికి వెళ్ళి

పండ్లను మ్రింగుటకారంభించెను. నేను తిన్నగా వానిదగ్గరకు వెళ్ళి యేమిక్కడ గూర్చున్నావని య డిగితిని. మలవిసర్జనము జేయుచున్నానని బదులు చెప్పెను. ఏదీ చూపుమని యడిగితిని. అందు కతడు పశువుయొక్క పేడయుండ నెత్తి చూపెను. నేను జూచి పరీక్షించి "ఇది పశువుపేడగాని మను ష్యుని మలముగా" దంటిని. అతడందుకు "భ క్త్యాదులవలన మనుష్యులు తీర్థంకరులగుచుండగా, భయాదులవలన నేను పశువుగాగానేరనా?" యని బదులుచెప్పెను. నీవు పశువుగా మారియుండినచో, చబుకుదెబ్బలు తినవలెనని, బారుకోలుతో అర్ధడ జన్ బహుమానమిచ్చి పంపితిని.

విద్యాలంకారుడు.

మీరైదు ప్రశ్నలకు ముఖ్యముగ బదులు చెప్ప వలయును. (1) ఋషభదేవునియొక్క యుత్పత్తి దినము, వయస్సు, గతకాలముల మితులేమి? (2) మీమతప్రకారము భూగోళముయొక్క కొల తయెంత? (3) స్వయంభూ ద్వీపముయొక్క పరి

మాణము దానిహద్దులేవి? (4) జైనులకు మాన
నీయులగు బుద్ధులెవరు! యీ విషయమున నమర
సింహుని నిఘంటువును ప్రమాణముగ స్వీకరింతు
రాలేదా? దేనిని ప్రమాణముగ స్వీకరింతురు?
(5) నాలుగుపరుగుల నిడివిగల త్రేళ్లును దోమలు
ను నలువది యెనిమిది క్రోశముల నిడివిగల పేను
లుగల స్థలమేది?

జైనాచార్యుడు.

మీరును నాప్రశ్నల కుత్తరములు జెప్పవలసి
యున్నది. మందపాలుడను మహర్షి లావుకపిట్ట
తో సంభోగించి సంతానము గలిగించినది సంభవ
మేనా? విభండకఋషి లేడిని పొంది ఋష్యశృం
గుని గనినది యసంభవముగాదా? వాయువు కో
తిని సంగమించి హనుమంతుని బుట్టించినది, శా
స్త్రసిద్ధమేనా? సూర్యుడు గుఱ్ఱమును రమించి
అశ్వినులను గనినది సృష్టి క్రమవిరుద్ధముకాదా?
కృష్ణుడు భల్లూకమును కామించినది క్రమమేనా?

ఇంద్రసూర్యులు, మర్కటమును గూడి వాలి సుగ్రీవుల గనినది యుక్తమేనా?

విదూషకుడు.

పృష్ఠ తాడనం-దంతభగ్నమన్నట్లున్నది. జైనాచార్యులయింటిలో గుఱ్ఱము గ్రుడ్డు బెట్టితే-పౌరాణిక-తిమ్మణాచార్యులు, ఆడగ్రుడ్డో అథవా మొగగుడ్డో-యని పరీక్షించుటకు వెళ్లియుండవచ్చును. ఇది విద్యాలంకారుల కేమి సంబంధము? “ ఏమి జినప్పా! గువ్వామ్మ కథ చెప్పితివనగా తిమ్మన్న కాకమ్మకథ చెప్పినాడు” అనుటతో సమానమైనది. ఇంతసేపును పలుమారు పురాణములు కల్పితములని విద్యాలంకారుడు చెప్పినదంతయు, చెవిటివాని ముందర శంఖునాదిలట్లులయ్యెను.

ధర్మపాలుడు.

జైనాచార్యులు తమ మతము పురాణములను బోలియున్నట్లు, స్వకీయ సమ్మతిని జేయకున్న విధి లేదు. గావున నట్లు అడుగవలసివచ్చినది. ఈమ

తము కేవలమాస్తికమును గాకను, నాస్తికమును గాకయు, నున్నట్లున్నది. జైనాచార్య్యులవారూ! విద్యాలంకారులయొక్క ప్రశ్నలమైదింటికి బదులు చెప్పలేకున్న తాము విశ్రమింపవలయును.

రాజు.

మరెవ్వరైన ప్రసంగముజేయు కోరికయున్నచో వ్యాఖ్యానస్థానమునకు రావలయును. ఇకమీాద ప్రసంగింపగోరువారి మతమునందు దుర్భక్షణము లుండరాదని మరల హెచ్చరించుచున్నాడను.

---

కంఠీరవవైఖానసులు.

బేహాగ్ రాగము.

జయతుజయతుజయ – జయజగధీశా । జయతు సత్యాత్మకజయపరమేశా॥

అనుపమమేకమజరమవికారం । జననమరణవిరహితనిరాకారం॥ జయ॥ ౧।

నిజనిజకర్మఫలప్రదమేకం । నిజసేవకమునిజననుతలోకం॥ జయ॥ ౨॥

ఓంకారాత్మకవరమహిమానం । శంకరహితపదప్రాప్తివిమానం॥ జయ॥ ౩॥

మహాజనులారా! వైఖానస మతము భక్తి ప్రధానమైనమతము. ఈశ్వరుడు నిరాకారుడు; యింద్రియములకు గోచరుడుకాడు; గనుక భక్తి మార్గముచేత విగ్రహారాధన చేసి ముక్తి పొందవలయును. మనోబుధ్యాదులకు వేద్యుడు కానట్టి దేవుని, భక్తితో ధ్యానించుటకు ప్రథమమందు ప్రతిమార్చనమే సాధనము. ఏలననగా మనమొక ప్రతికృతి యనగా ఫొటోగ్రాపును చూచినప్పుడు ప్రతి

కృషిసల్పెదరేని వారిగుణములు బోధపడి వారిపై విశ్వాసమును మైత్రియు గలుగుచుండు గాన విగ్రహారాధనవలన నీశ్వరభక్తి కలుగును మోక్షము తప్పక కలుగును.

## ధర్మపాలుడు

మన మెన్నడు నెరుంగని ఈశ్వరునికి మరియు నిరాకారునకు యాకారముతో గూడిన విగ్రహమును పూజించినచో సత్యస్వరూపమెట్లు బోధపడును? మనము చూచిన మిత్రుని పటమును జూచినప్పుడు వాని గుణములు బోధపడును గాని, మనకపరిచయస్తుడును మన మెన్నడు నెరుంగనివానిపటమును జూచిన నేమియు గ్రహింపజాలము. "నతస్యప్రతిమా అస్తి యస్యనామ మహద్యశః" అని ఈశ్వరుడు విగ్రహరూపుడుగాడని ప్రమాణములుగలవు. మనమింగ్లీషు తెలియని వానినిజూచి "బ్రింగ్ ది వాటర్" అని చెప్పినయెడల వాడేటుగ్రహించును? గావున నప్రత్యక్షుడగు నీశ్వరుని, ప్రతిమగా నిల్పి పూజించుట నాస్తికమగుచున్నది.

## కంఠీరవవైఖానసులు.

ఒకబాలునకు ప్రథమమగు నక్షరాభ్యాసము లేకుండ నట్లు విద్యావంతుడగును? గాన నీశ్వరుని తెలియుటకిది ప్రథమ సాధనముగానున్నది. "ప్రతిమాస్వల్పబుద్ధీనాం" "కాష్ఠలోష్టేషుమూర్ఖానాం" "ప్రతిమానునయోగినః" "అజ్ఞానంభావనార్థాయ ప్రతిమాఃపరికల్పితాః" అన్నట్లు సాధారణజనులకు మూర్తిపూజవలన భక్తి కలుగునను టకు సందేహములేదు. మరియు నిందులో దోషమేమియును లేదు.

## ధర్మపాలుడు.

అవధి హద్దులు గలిగిన యక్షరాభ్యాసమున కును, మితి మేరలేని విగ్రహపూజకు నుపమాన ము పోల్చుట శాస్త్రవిరోధము. మరియు నిరాకారమగు నీశ్వరీయజ్ఞానబోధకు సాకారవిగ్రహార్చనము సాధనమనుటయు నవివేకము. మీరిపుడు వయోవృద్ధులై యుండియు మీ యక్షరాభ్యాసము

ముంగియకున్నది. చచ్చువరకును జేయు నక్షరా భ్యాసమేలోకమునగలదు? విగ్రహమును దేవుడని భావించుచు మరల నది సాధనమని చెప్పుట యసం గతమగుచున్నది. చెన్నపురి చేరుటకు బండిసాధ నమని చెప్పుచు బండియే-చెన్నపురియని భావించ డమేమి? ప్రతిమార్చనము పామరులకొరకని చెప్పు చున్నారుగదా? గనుక మీరు విగ్రహారాధనచేయు నంతవరకు నజ్ఞానులగుదురు. గావున మీమతము భక్తిమార్గము గానేరక అజ్ఞానమార్గమయ్యెను.

కంఠీరవవైఖానసులు.

పరులయొక్క యవలంబనముకొరకు మార్గద ర్శకముగా మేము పూజ చేయుచున్నారముగాని మాకొరకుగాదు. మేము చేయకున్నయెడల పా మరులెట్లు గ్రహించవలయును?

ధర్మపాలుడు.

బీదలు బిక్షమెత్తుట నేర్చుకొనుటకుగాను, కో టీశ్వరులును, మహారాజులును, భిక్షమెత్తి సదా

జీవించవలయునుగదా? ఈపద్ధతి ప్రకారమందరుసు "మాంపాతుంభీతిపాటనం" బనుమంత్రమును జపించుచు యిల్లిల్లు తిరుగుట సంభవించెను.

విదూషకుడు.

పూర్వమొకచాకలివాడు తన గాడిదెలకు బరువుమోయుట నేర్పుటకై తాను బరువులు మోసి మోసి, చచ్చునప్పుడు తనకొమారునకును, యిదే పద్ధతిని జూపినట్లున్నది. ఈలోకములో ఇక్ష్వకుస్టాండర్డు – పరలోకములో ఫస్టుస్టాండర్డు - స్వర్గములో సెకండుస్టాండర్డు - యీ పద్ధతికి నేనను మోదించినాను.

కంఠీరవ వైఖానసులు.

ఆకారరహితమైన శుద్ధశూన్యమునేమి - ధ్యానించడమనగా నేమి – నాబుద్ధి కేమియు తోచకున్నది.

విద్యాలంకారుడు.

నేనొకసంగతి మీకు చెప్పుచుండగా మీ రేకా

గ్రచిత్తముతో వినుచున్నారు. మీరు చిత్తైకా గ్రతతో విననియెడల, నే జెప్పినదానిని గ్రహింప జాలరు. అట్టి చిత్తమునకు ధ్యానమని పేరు. ధ్యాత యగు జీవాత్మ ధ్యేయమగు పరమాత్మయొక్క మహిమాది గుణస్వభావములను తనలో దలంచుటకు ధ్యానమని నామాంతరము. ఇట్లు ధ్యానించుట అంతఃకరణముయొక్క పనిగానున్నది చూచుట- వినుట-తాకుట మొదలగునవి, వేరువేరుపనులు. చూచుటకు రూపమును, వినుటకు శబ్దమును, యావశ్యకములు. ఇక్కడ ధ్యానించుటకు అస్తిత్వము – యావశ్యకమైయున్నదిగాని రూపముగాదు. రూపములను ధ్యానించుట యసంభవము. పర్వతమును విన్నాననిగాని, వీణానాదమును చూచితిననిగాని చెప్పుట యెట్లు అసంగతమో అట్లు రూపమును ధ్యానించితినని చెప్పుట యసంగతమగుచున్నది. రూపములను దలంచుటకు స్మృతియని పేరు. స్మృతియనగా చూచియుండిన దానిని జ్ఞాపకమునకు దెచ్చుకొనుట. గనుక ధ్యానము నిరాకారమునందే జరుగవలసియున్నది. తల్లి

యొక్క దయనున్ను, గురువుయొక్క జ్ఞానమును న్ను, ధ్యానించుటకెట్లు ఆకారములు పనికిరానే రవో అట్లు భగవంతుని పవిత్రగుణములను ధ్యా నించుటకు తూకము పరిమాణము గలిగిన విగ్ర హములు సాధనములుగానేరవు.

విదూషకుడు.

స్వామీ! తమకుపనయన సంస్కారము జరిగిన ప్పుడు బ్రహ్మోపదేశమగు గాయత్రిని మీయాచా ర్యులుపదేశించినారా? అథవా బొమ్మల నిచ్చి పూజచేయుమని సెలవిచ్చియున్నారా? పూజారు లు అనగా పూజకు శత్రువులని అర్థము. ఈపేరు మీకేలకలిగెను?

హనుమంతమధ్వ.

విగ్రహములనేకములు తమంతకు తామే పుట్టి నవిగలవు. ఇప్పుడు తిరుపతి మొదలగు స్థలము లలో నెంత మహిమ జరుగుచున్నది చూడుము మీరిప్పుడు నూతనముగ నొక దివ్యస్థలమును స్థా

పించుడు చూతము! మీచేత కానిపనిని దూషించి ప్రయోజన మేమి?

విదూషకుడు.

విగ్రహములు తమంతకు తామే పుట్టిన దేవరు చూచియుండిరి? ఇప్పుడు సంవత్సరమున కెంత పెరు గుచున్నవి? అవి యెప్పుడుచచ్చి స్వర్గముచేరును? జాతస్యమరణంధ్రువం అన్నట్లు పుట్టినవి చచ్చితీర వలయును. ఇప్పుడు ప్రాణముండునది లేనిది నా డీపరీక్షచేసిచూచితిరా? ఒకదొంగలజట్టునకు యజ మానుడగు చోరాచార్యునిజూచి, "ఇది నీకు యో గ్యమైన కృత్యమా!" యనియడుగగా నతడు "వె ధవా రీదోపిడిదండును స్థాపించుటకు నీకు యో గ్యతలేక, నన్నధిక్షేపించుచున్నవాడవా" యని బదులుచెప్పెను. అరీతిగానీ శిరక్షౌరములు, నీధన క్షౌరములు, నీయారోగ్యక్షౌరములు, నీయాయు క్షౌరములు, నీదోపుకంపెనీలు, యెవరు స్థాపింప గలరు! అందుకు తగినవారు మీరును మీబోటి వారుమాత్రమే.

హనుమంతమధ్వ.

మంత్రమ్ముల బలముతో విగ్రహములకు ప్రాణ ధారణంబు జేయునట్టి యావాహనమబద్ధమా!

విదూషకుడు.

విగ్రహమ్ములకు ప్రాణధారణము చేయువారు తమయిండ్లలో చచ్చినవారినందరిని యేల బ్రతికింపరాదు? మొన్న మీయింట చచ్చినపిల్లవాని పేరు చిరంజీవి గదా! చచ్చినను చింత లేదు. పేరు బాగున్నది.

హనుమంతమధ్వ.

పూర్వీకులందరును విగ్రహపూజను సలుపుచు వచ్చినారుగాని అదికూడదని యెవరును ఖండించ లేదు.

ధర్మపాలుడు.

శంకరసిద్ధాంతప్రకారము మూర్తి పూజఖండింపబడినది.

## హనుమంతమధ్వ.

శంకరాచార్యుల మాటయు వారి యద్వైతము మీరే ఖండించి యున్నారు. గనుక మేము దాని నంగీకరింపము. ఇంతకును అతడు—“ ఉత్పన్నః సంకరాత్మాయం సర్వకర్మబహిష్కృతః । సూత్రైః ప్రపంచయాంచక్రే మాయావీ సాగతం మతం । దుఃశ్శాస్త్రీమపరః దైత్యా స్వతఏవ హరిద్విషః । అనురావేశినస్సర్వే సంకరస్యవశంగతాః ” ఇత్యాది మణిమంజరీగ్రంథ ప్రమాణము చొప్పున, నాస్తికుడుగాను, సంకరుడుగాను, వేద బాహ్యుడుగాను, దైత్యుడుగాను, దేవద్వేషిగా నున్నవాడు.

## బ్రహ్మముగారు.

మీలో నెవరోనొకరు కల్పించిన గ్రంథమెట్లు ప్రమాణమగును? మీకును మాకును మాననీయులు పూజనీయులునగు మహర్షి వ్యాసులువారు వ్రాసినది ప్రమాణము. వారేమి వ్రాసియున్న

వారో వినుడు. " ధీరే కలియుగే ప్రాప్తే మ్లే చ్ఛైర్వ్యాప్తే భువస్తలే ! సర్వాచారపరిభ్రష్టా భ విష్యంతి నరాధమాః । తదాంధ్రదేశమధ్యేతు దా క్షిణాత్యో భవిష్యతి । బ్రాహ్మణోదుర్భగః కశ్చి ద్విధవా బ్రాహ్మణీరతః । తస్య పాపిష్ఠవిప్రస్య వ్య భిచారాత్సుతో౽ఘః । ......తదావసంతః కర్ణాట తిలంగాదిక దూషకః । మధునామాచ విధవాక్షే త్రే విప్రాద్భవిష్యతి । ......మధ్వాచార్యస్తతో భావా ద్దాక్షిణాత్యో మహోత్కటా । తచ్ఛిష్యాః ప్రతిశిష్యాశ్చ నార్యావర్తేన చోత్కటే । పాపిష్ఠా నైవమన్యంతే వేదమార్గ బహిష్కృతాః । ఆచా ర్యం మధునామానం వదంతో విధవాసుతం । ప్ర చ్ఛన్నో సౌ మహాదుష్టశ్చార్వాకో మధుసంజ్ఞకః । పంచవర్షం యతింకృత్వా గ్రమేణాదాయ బాలకం । మాతాపత్యం విధాస్యంతి ద్రవ్యలోభేననాస్తికాః । భోగాసక్తాశ్చ పాపిష్ఠా దాసీగమనకారిణః । ... వైష్ణవా వేషమాత్రేణ తంతుమాత్రేణ వాడ వాః ॥ " ఇత్యాదిగా మధ్వాచార్యుడు వేదనింద కుడు, నాస్తికుడు, పాపిష్ఠుడు, వేషధారియు,

విధవాపుత్రుడును, మ్లేచ్ఛుడని సౌరపురాణమున నున్నది.

విదూషకుడు.

ఇప్పుడు బాగున్నది. పూర్వమొక మాధ్వుడు తన స్నేహితుడగు స్మార్తుని జూచి, నీవు రూపునందు నావలెనే యున్నావు గనుక నేనడిగినందుకు సందేహపడక చెప్పవలయును. నిజము దాచవలదు. మా యింటికి మీ తల్లిగారెప్పుడైన వచ్చి యుండవచ్చునుగదా? యని యడిగెను. అందుకా స్మార్తుడు—“ ఇందుకు సందేహ మెందుకు? మా తల్లి నిజముగా మీ యింటికి రాలేదు గాని మా తండ్రిగారు మాత్ర మిప్పటికిని మీ యింటికి వెళ్ళుచుండును ” అని బదులు చెప్పెను. ఈ కలహమిట్లే యున్నది.

రాజు.

స్వామీ! తామింక శాంతేధారకులై గూర్చుండ వలయును. ధర్మపాలా! చూచితివిగదా! మ

తచర్య లెట్లున్నవి?

ముఖారి రాగము.

వేటాయెను వినగవినగను వింతయగు మతకథ

లహా । దోషపూరిత మతమతాంతర దుష్పథంబు

ల గనిహా ॥ ॥౧॥

ఏమజూచిన బంధనంబుల పొందికయ్యెను నా

హాహా । అందమగుసత్యంబు నెఱుగని దంధనంబు

లు జాడహా ॥ ॥౨॥

అర్థినైనే వింత జేసియు సార్థకము లేదేమొగా ।

ఆర్తపూరితమయ్యె దేశము అఖిలదుఃఖాన్వితముగా॥

వ్యాస శంకర మధ్వులాదిమహాశయుల నీరీతి

గా । దోషమేమియులేని పూర్వుల దూషణలు వి

ననాయెగా ॥ ॥వేట॥ ॥౪॥

మిత్రమా! వినుము! మహాజనులారా! వినుము!

"అపూజ్యాయత్రపూజ్యంతే పూజ్యానాంచ వ్యతిక్ర

మాత్ । త్రీణితత్రభవిష్యంతి దుర్భిక్షం మరణం

వ్యథా ॥ " అర్థాత్—యెచ్చట నవిద్యాప్రవా

హాములోబడి అపూజ్య పురుషులకు సత్కారము
ను, పూజ్యులగువారికి తిరస్కారమును చేయబడు
చున్నదో యచ్చట నవశ్యముగా దుర్భిక్షమును,
రోగాది వ్యథలును, అకాలమరణమును, కలుగు
చుండును. విచారించి చూడుడు! భారత వర్షము
నకీ మూడును ప్రాదుర్భూతమై యున్నవి. భగ
వంతుని పూజించుటకు కావలసిన పుష్పములను గు
రించి యొక జ్ఞానిచెప్పినది వినుడు. " అహింసా
ప్రథమం పుష్పం పుష్పమింద్రియ నిగ్రహః । సర్వ
భూతదయాపుష్పం క్షమాపుష్పం విశేషతః । ధ్యా
నపుష్పం లయఃపుష్పం జ్ఞానపుష్పంతు సప్తమం ।
సత్యంచైవాష్టమంపుష్పం తేనతుష్యంతి దేవతః॥ "
అనగా, దేవపూజకు, నహింస, ఇంద్రియ నిగ్రహ
ము, భూతదయ, క్షమ, ధ్యానం, లయం, జ్ఞానం,
సత్య మిత్యాది పుష్పములు కావలయునని తాత్ప
ర్యము. ఇప్పటి పూజయొక్క దశ యెట్లున్నది?
దీనికింతటితో నమస్కరించి చాలించుచున్నారము.

నేనును నమస్కారములు చెప్పుచున్నాను "మనసా పూజావిధానం సమాప్తమ్ ॥ ఓం శ్రీ భారతదేశవాసిభ్యః మత మతాంతరిభ్యోనమః। ఓం మత్తమైకపదార్థ పరిగ్రహణ భారతదేవీభ్యోనమః। ఓం కాష్ఠలోష్ట లోహాది జడగోబరగణేశ కలుష కలశపూరిత మూర్తిభ్యోనమః। ఓం వైమత్యభాషితానైక మతాంతర ప్రవర్తక చతుర్దశ ప్రదేశవాసి హిందూభ్యోనమః। ఓం గాఢాగప్ప ఘంటాఘోష ఘనోధర పూరణాచారిభ్యోనమః। ఓం అల్లాయిల్లల్లో చౌబెజీభ్యోనమః। ఓం భగవతీ భాగీరతీ భోగినీ శాకినీ డాకినీభ్యోనమః। ఓం పంచప్రపంచ లంచ గ్రహణ జమాదారీభ్యశ్చ అమల్దారీ తగరాకుర తన మఠాధిపతిభ్యోనమః। ఓం నిరక్షరకుక్షి నిశ్శాస్త్రి నిరాధ్యాపక నిర్బుద్ధి బ్రాహ్మణేభ్యోనమః। ఓం అక్షయ క్షయరోగగ్రసిత దుర్బల ప్రబల నిర్వీర్య నిస్తేజ శూర వీరరహిత క్షత్రియేభ్యోనమః। ఓం వేశ్యా పాదపూజక నర్తనా

నంద నిత్యాన్నపానగ్రహణ ధుకీణ నిర్వాణ పద వాక్యప్రమాణ విశేష దూష్య వైశ్యజనేభ్యోనమః। ఓం అభద్ర రౌద్ర దరిద్ర క్షుద్ర ప్రసిద్ధ శూద్రాభ్యాంనమః । ఓం...............

## ధర్మపాలుడు.

విదూషకా! చాలించుము చాలించుము!! ఓ సభ్యమహాజనులారా! ఈ భారతభూమీశుడును ధర్మాసక్తుడునగు మహారాజుగారు, తాము-సత్య జిజ్ఞాస శిష్టజన యభీష్టప్రదంబగు సంఘసమావేశం బున, నత్యంత దుష్టభూయిష్ట మతాంధకార వినష్టంబు గావించి, ముముక్షు వర్గంబున కపవర్గమార్గ ప్రదాతలై, సర్వజన మిత్రులైనందున, వీరి పవిత్రచరిత్రంబు బుధస్తోత్ర పాత్రంబయ్యె. సర్వదేశంబులందును వ్యాపకంబులై, యక్కజంబులగు పెక్కు గతుల దుష్పథంబులలో, నరులను ప్రవర్తింపజేసిన, చెడుమతంబుల వలని దోషంబను విషంబును, నాశనంబుజేయబూనిన వీరి మానసం బెంతయు శ్లాఘ్య యోగ్యంబయ్యెను. రాజుగారి

వినమ్ర జనసముదయ దయానువర్తనంబును, వారికిగల సమస్త బుధసత్తమ స్తవనీయాపార కృపారసంబును, వారభ్యసించిన దురిత భరిత మతమతాంతర ప్రతినిధి కృతకాతిశయ పర్వతహంత కుఠారరూప శాస్త్రజ్ఞానంబును, వారియొక్క వేదవేదాంగేతిహాస ప్రమాణసహిత యుక్తియుక్తానర్గళ ధారాఝురింబోలు వాదంబును, వారు చేసిన కరుణాగుణశూన్యశుష్క మనస్కులగు ముష్కర తురుష్క క్రైస్తవాది మతబహిష్కారంబును, వారు నిరసించిన దుష్పథానుమోద ప్రధాన కుకర్మవిధానంబును, వారవలంబించిన సత్యపక్షరక్షణ విబుధ విచక్షణ దుష్టమార్గశిక్షణ విజ్ఞానాకాంక్షణంబును, వారు సంపాదించిన మతమతాంతరాసనానారణ్య ఖండన ప్రావీణ్యంబగు నగణ్య పుణ్యంబును నేనెంతని వర్ణింతును? ఇట్టి స్వయంసిద్ధమగు నీశ్వర ప్రకాశమున కడ్డముగ నుండిన మతాంతర మేఘమండలంబుల బారదోలు నీప్రచండవేగయుత భారతమహారాజ వాయుదేవునకు, మనము మిక్కిలి కృతజ్ఞులమై యుందముగాత!

ఇప్పుడు శ్రీయుత విద్యాలంకారులు, సకలదేశ సర్వజన—సమస్తలోకప్రియమైన మతమునుగురించి ప్రసంగించుచున్నవారు. సభికులు సావధానచిత్తములతో నాలకించుదురని ప్రార్థించుచున్నవాడను.

విదూషకుడు.

సభ్యులారా! విద్యాలంకారుడుగారు—ఉక్కు శనగల నుడుకబెట్టి తిరుగబోతవేసి, సభికులకు బంచిపెట్టుదురట. ఇదెట్లు సాధ్యమో యందరును పరిక్షింతముగాక! ఏదో! సార్వభౌమ ధర్మమట! దానిని వినవలయునట! అది మనలను బట్టుకొనునట!

భజన.

సురటిరాగము.

పరిపాక కర్మఫలాధికారా— పరమపురుష పరాత్పరా। పరిపూర్ణ నిర్ణయ పాపశిక్షక—పారమార్థిక రక్షకా ॥ప॥

భవభీకరా భువనేశ్వరా—బలభాస్కరా పరమే

శ్వరా। శివశంకరా సుగుణాకరా—భువనోదరా క
రుణాకరా ॥ ॥ప॥

గణనాయకా ఉపకారకా—సుఖదాయకా విధి
నేమకా। గుణాధారకా ప్రళయాంతకా—అనుగ్రహ
పకా మహదాత్మకా ॥ ॥౨॥

గుణభూషణా భయవారణా—పరిపాలితాఖిల స
జ్జనా। గణనాధికాఖిల లోకరక్షణ—వినుత గుణగ
ణధారణా ॥3॥

విద్యాలంకారము.

సభాసదులారా! మనుష్యుల మరపు, అజ్ఞాన
ము, ఆగ్రహములయొక్క విషము, వారిని సత్య
మార్గమునుండి తొలగింప జేయుచున్నది. సత్యా
న్వేషకులగువారు నీ వేషాంతరములు, యాచార
భేదములు,మతాంతరములు, యీ భిన్న భిన్న య
వాంతరముల చూచినప్పుడు, వాటి నన్నిటిని న
మ్మక, యేదోయొక సత్య మతమున్నదని మాత్ర
ము గ్రహించియున్నారు. సర్వవ్యాపకుడగు పర

మాత్మ, తనయొక్క యపార కరుణవలన తనయ మైథునసృష్టియందు, పవిత్రులైన, శుద్ధసంకల్పులైన, పరిపూర్ణజ్ఞానులైన ఋషులు అథవా భక్తుల మూలముగా నట్టి సత్యవేదమును ప్రకాశింప జేసెనని యందరును, నాదికాలమునుండి నేటివరకును ఘాడుకొను చున్నారు.

ఈశ్వరీయమగు గ్రంథము, యితర గ్రంథముల కంటె, శ్రేష్ఠతమముగానుండుట, ముఖ్యమైన విషయము. దానియందన్యమత గ్రంథములందు లేని విశేషములన్నియు నుండవలయును. యెందుకనగా, యేమనుష్యుడుగాని యీశ్వర గుణములతో తుల్యముగా గ్రంథ మొనరింపజాలడు. అది సృష్ట్యాదినుండియు మార్పుచెందక, నశింపక, ప్రాథమికమై, స్థిరముగా నుండవలయును. దానిలో, నే గ్రంథములను గురించిగాని,మనుష్య సంబంధమగు యితిహాసములు చరిత్రలుగాని, కథలుగాని యుండరాదు. మరియు దానియందు నగరములయొక్కగాని, మనుష్యాదుల నామములు, వర్ణన

లు, పరస్పర విరోధములు, వ్యాఘాతములు, సృష్టి నియమ విరుద్ధములు, బుద్ధి విద్యలకు వ్యతిరేకము లు, పక్షపాతములుండక, దేశ–జాతి–కాల విశే షములకు సమానముగ, సత్యముగను, న్యాయ ముగను, యుక్తముగను, పవిత్రమైన ప్రాచీనమైన భాషలో నుండవలయును. ఇందొక్కటి చేడిన నది యీశ్వరీయ గ్రంథముగానేరదు.

వేదమునందేమి యుండకూడదో, అవియన్ని యు నీ మతమతాంతర గ్రంథములందున్నవి. ఏ దీ–సభికులలో నెవరైన "మామతగ్రంథ మిట్టి స త్యవిద్యాన్వితమైనది" యని లేచి చెప్పుడు చూ తము! నా వివాహమును గురించిన కథలుగల గ్రం థమును మా తాత వ్రాసియున్నాడని, యే పిచ్చి పుల్లయ్య చెప్పగలడు? దాని–నే వెఱ్ఱివెంకయ్య వి నగలడు?

మనము సుశిక్షావంచితులై, యీయాధునిక పు స్తక పంథమున బహుదూరము నడచి యున్నవా రము; గావున వెనుకకు జూచినను, యది, గోచ

రింపక యున్నది. ఇంతదూరము నడచితిమి గను క, వెనుకకు మరలుట సయితము కష్టముగాను, దుఃఖముగాను తోచుచున్నది. మరలించుట— యంతకంటె నసాధ్యమై పోయినది. బహుదినము లు నిద్రించినవాని, నెవరైన ధట్టన లేపిన యెడల, నతడాగ్రహ పడుటయు, లేపిన వానిని బద్ధశత్రువు గ భావించుటయు, నేమి యాశ్చర్యము.

సోదరులారా! ధర్మశూన్యమగు దొంగలగుం పునకొక్క సాధువు జిక్కినప్పుడు, అసత్యములు పలికి, యకర్మములాచరింప వలసినట్లు, సత్యాన్వే షకులనేకులు, బహుకాలానుసరణంబులగు, కుపం థ బలవంతములకు లోబడవలసిన వారగుచున్న వారు. అయితే నిజమును గనుగొన్న వానిని జయించువాడు లేడు. సత్యమును నమ్మించుటకు గాలికి బుట్టవలసినది లేదు. చచ్చి బ్రతికినవాడు చెప్పినను, యసత్యము సత్యముగానేరదు. క్రూర దురాచారములుగల గ్రంథములు, స్వర్గమునుండి దిగివచ్చినవని, జనులను భ్రమింపజేసినను, యవి,

పరిగ్రహమునకంటె నెక్కువ పరిత్యాగములుగా నుండును. గుమ్మడికాయలో బుట్టినవాడు చెప్పె నన్న హేతువుచేత, జీవుడు దేవుడు కానేరడు. నేను మీకు సత్యమును బోధించుటకై, నలువదిసేర్లు గుగ్గిళ్లుతిని, నూరుల కొలది యఱటిపండ్లను భక్షిం చవలసిన యగత్య మేమున్నది? ఆరును నాలుగును పదియని బోధించుటకు, నవతారములు గావల యునా? ఈ బూటకముల మహిమ చేతనే-మన మింతదూరము నీ ఘోరకలహముల వరకు నడచి వచ్చితిమి.

భ్రాతలారా! పంచ భూతములు, సూర్య చంద్ర నక్షత్ర యాకాశములు నందరికి సమానముగ దయచేసిన దేవుడు, తన సత్యమతము నందరికి స మానముగ నిచ్చి యుండడా? తాను దయాళువై, యుండి, మనకు నిర్దయను బోధించునా? అతడు న్యాయకారియై యుండి, మనకన్యాయము నుపదే శించునా? అసత్యము, అన్యాయము, క్రూరము, అయుక్తములుగల మానవులను, మనకు దేవదూ

తలుగా బంపియుండునా? మీలోపల ధ్యానించి యోచించుడు!

అన్నలారా! హిందూ క్రైస్తవ మహమ్మదీయ జైనాది మతాంతర సోదరులారా! మీలో ప్రతివాడును స్వర్గము జేరునా? మీలో పాపాత్ము లెవ్వరును లేరా? యెవరును నరకమునకు వెళ్ళరా? అందరికి ముక్తి లభించునా? అందరిలోను పాతకులును పుణ్యాత్ములును గలరనుట కేమైన యాక్షేపణ యున్నదా? ఏమిది! మీ మతములిట్లు కొందరిని పుణ్యాత్ములుగాను, కొందరిని పాపాత్ములుగా, నేల చేసెను? మన ధన యాయురారోగ్య శిరక్షౌర ప్రసాదములకును, లడాయీలు, లాటీ దెబ్బలు, జుల్మానాలు, శిక్షలు, కత్తులు, భిక్షులకును కారణములు, మీ మతములు గావని, యెవరైన, సాహసించి చెప్పగలరా? ఒకని సొత్తును దోచుకొన్నచో వాడు దుఃఖించునని యును, యొక జంతువును జంపునపుడది ఘోరబాధ ననుభవించుననియు, ప్రత్యక్షముగ దెలియుచుండగా నిట్టి కర్మమాచరణ యోగ్యమని చెప్పెడు మ

తమిూశ్వరీయమని నమ్మువారు మానవులా? అథవా కూపగమృగములా? ఇద్దరి దొంగలలో నొకడు యతివేషమును ధరించినప్పుడు, వాడు మోక్షార్హుడని మిూలో నెవరు నమ్ముదురు? ఒక వ్యభిచారిణి ప్రతిదినము, పతియొక్క పాదపూజ సల్పినచో నది పతివ్రతయగునా? విషముకలిసిన యన్నమును భుజించువారు జీవింపగలరా? దుష్టులు స్తోత్రము చేసినచో, న్యాయాధిపతి శిక్షింపక వదలివేయునా?

ప్రియ స్నేహితులారా! రంగు కాకితములతోడను, రంగు గుడ్డలతోడను, రంగు మైనములతోడను నిర్మించిన చెట్లు, చూపున కందముగను యలంకారముగ నున్నను, నిజముగా భగవంతునివలన నిర్మింప బడిన చెట్లనుండి మనకు గలిగెడు ప్రయోజనములలో నొక్కటియైనను, యాకృత్రిమ చెట్లనుండి మనకు లభించునా? ఇట్టి మతాంతరములు—యీలాటి మతప్రచారకులు—మనకు సద్గతిని యిప్పింతురా? వారు మనుష్యులుగారా? మను

ష్యులు శహబాష్ అని మెచ్చుకొన్నచో దేవుడు మనల ప్రేమించునా? వారు బహిష్కరించిన మన కు నరకము కలుగునా? ఒక భిక్షుకుని, పృథ్వీపతి యని యందరు పిలచిన, నతడు రాజగునా?

విద్వాంసులారా? ఈ దేశస్థ మతమతాంతరు లలో నూటికి తొంబది తొమ్మిది మంది వంతున, కృతఘ్నులు, మిథ్యాచారులు, వేదబాహ్యులు, జా రులు, చోరులు, జూదరులు, హింసకులు, మాంస భక్షకులు, మద్యపానులు, పరదార ధనాపహారులు, నన్యాయపరులు, అజ్ఞానులు, నిర్లజ్జగలవారు, కృప ణులు, దురాచారులు, అత్యాచారులు, అహంకా రులు, దురభిమానులు, దాంభికులు, దుర్బుద్ధిగల వారు, దుష్టులు, నీచులు, సాహస పరాక్రమ శౌ ర్యౌదార్య విహీనులు, కుటిలులు, దుర్జనులు, దు ర్వర్తనులు, నీతిరహితులు, నాస్తికులు, పుత్రీ విక్ర యులు, శిశుఘాతకులు, అశాంత చిత్తులు, మూ ర్ఖులు, శిశ్నోదర స్వార్థ మాత్ర పరాయణులు, ధ నైకలుబ్ధులు, క్రియాభ్రష్టులు, కల్పిత కర్మఠులు,

ద్వేషులు, ఛల కపట పక్షపాత దంభాసూయాపరు లు, లంచకోరులు, భూతదయ పశ్చాత్తాప విహీనులు, సత్కర్మవిఘ్నకారులు, దుష్కర్మధురీణులు, వేశ్యాసేవకులు, మాతా పిత గురు మిత్రద్రోహులు, అన్నవిక్రయులు, నిస్తేజులు, జడబుద్ధులు, పురుషార్థ విహీనులు, ఆశ్రమదూరులు, ధర్మరహితులు, కాల్పనికవ్యవహారులు, కల్పిత సంప్రదాయకులు, కీర్తి ఖ్యాతి శ్రేయోభివృద్ధి భంగకారకులు, దురహంకారులు, గర్విష్ఠులు, రాగద్వేషక్షుద్ర కుహక కుచేష్టకులు, సత్యజ్ఞానదూరులు, అవిచారపరులు, ధర్మార్థ కామమోక్ష లక్షణ జ్ఞానశూన్యులు, సోమరులు. దక్షిణ భిక్షార్థ శునకములు, కుక్షింబరులగు నిరక్షరులు, అపాత్రులు, వ్యర్థవ్యయులు, రాజ ప్రజాద్రోహులు, అవిద్యాన్వితులు, గలరని నేజెప్పదాని నెవరైన ఖండింపగలరా? నూటికెంతమంది శమదమశాంత్యాది యుత్తమగుణ కర్మ స్వభావములుగల బ్రాహ్మణులున్నవారు? నూటికెందరు దుష్టశిక్షణ శిష్టరక్షణ తత్పరులగు క్షత్రియులున్నవారు? నూటికెందరు పదవాక్య. ప్ర

మాణజ్ఞులైన వైశ్యులుగలరు? నూటికెందరు సేవక శూరపీరత్వముగల శూద్రులున్నవారు? వర్ణసంక రమనగా నేమనుకొన్నవారు ? ఇదెవరిమహిమ? ఒకడు పగలు కోర్టులందు కూటసాక్ష్యములుచెప్పి లంచములు గ్రహించి రాత్రులలో చోరుడై జూద రియై కులటస్త్రీలం గూడుచుండియు, " నేనుబ్రా హ్మణుడను; గొప్ప కులమువాడను; సద్వంశజుడ ను; నా గంధాక్షతలం జూడుము; నా జందెమును పరికింపుము ; నాకుంకమరేఖ జూడుము; నాకచ్చె యు కుచ్చెళ్ళల నీక్షింపుము " యని చెప్పుకొ నుచుండుట బ్రాహ్మణత్వమునకును, వర్ణమునకు నెంతటి గౌరవముగానుండునో చెప్పగలరా ? దీనికి ధిక్కారముగాక మరేమి సమర్పింప వలయును ?

నా ధర్మభ్రాతలారా ! నేనిట్లంటినని కనుబొమ లు ముడివేయకుడు! కన్ను లెఱ్ఱగ జేయకుడు!నాసిక శ్వాసములు సలుపకుడు! దంతముల నూరకుడు ! పె దవుల గరవకుడు! ముఖములు చిట్లించుకొనకుడు! హస్తములనులుముకుడు! నాలుకలనుసమాళించుడు!

కువాక్యములనుచ్చరింపకుడు! వీరభద్రరూపముల ధరింపకుడు! రౌద్రముల నణంచుడు! శరీరముల కంపింపజేయకుడు! కుదృష్టులతో జూడకుడు! కోపముల నణంచుడు! ఆత్మలను క్లేశపరచకుడు! శాంతపడుడు! మతాంధకార కూపములో గిరగిర తిరిగి పడబోకుడు! నాయొక్క సవినయ నివేదనమును ధీరతతో నాలకింపుడు! నావాక్యములు, అసత్య సింహనాదములుగావు; నాపలుకు లాత్మస్తుతి వాగాడంబరములుగావు; నా వచనములు కపటప్రచారములుగావు, నాశబ్దములు డాంబిక వాగ్గుంభములు గావు; ఇది సత్యవ్యవహారము, సత్యాచారము; సత్యవాదిత్వము; ప్రమాణబద్ధము; యథార్థమైన యద్వైతము; పురాతనమైన సనాతనము; నిర్దోషిమైన యాత్మీయము. ఇది మతాంతరారణ్యముగా నేరదు. ఇందు క్రూర దురాచార దుష్టమృగములు లేవు.

ఈశ్వరపుత్రులారా! లెండి లెండి!! ధర్మకవచములను దొడిగికొని, సత్యాభిమాన సత్యశాస్త్రి

స్త్రింబులఁ గాని, యీ మతభూతమ్ముల జయిం తము రండు! విద్వాంసులారా! మీ మేధాశక్తి ఖ డ్గంబులచే నీ క్రూర నిశాచర కంఠంబుల ఖండించుడు! మీయుద్యమ ప్రదీప్త జ్ఞానప్రకాశమ్మును ప్రస రింపజేయుడు! మీవిద్యాప్రవచన పటుతా—సహనశీ లతా—నిర్భయతాది గుణగణంబుల గనబరచుడు! మీవిద్యాబల దేహబల బుద్ధిబల యాత్మబలాదుల ను సార్థక పరచుడు! ఈ భారతమహా మందిరమ్ము లో ప్రవేసించియుండు నీ గొప్ప మతాంతర సర్పం బుల జంపకున్న మనము సుఖనిద్ర జేయజాలము. ఇంక మతమతాంతర ముఖవికారముల బారదోలి పరిఫుల్లహృదయులు గావలయును. మనమిప్పుడు పరస్పరము మన బంధనంబుల ద్రెంచుకొనవలయు ను. అక్కటా! మనము పుట్టినదిమొదలు చచ్చి చితిపైబెట్టి కాల్చివేయువఱకును, పగలును రాత్రి యు, స్థలపరస్థలములలోను, నిద్ర జాగ్రతలయందు ను, కల్పిత మతపిశాచములయొక్క యధికారము నకు లోబడి, సంకెళ్ళతో సంపూర్ణబద్ధులై యుండ వలయును. కన్నులు తెరచి చూడుడు! ప్రతివ్య

క్తిస్వాతంత్ర్యమేమై పోయినది? ఆహా! యిదెంతటి సంతాపము! నేన ధర్మపరుడై జీవించవచ్చును. యె న్ని మహాపాతకములు చేసినను నేను చెడనుగాని నాచేతగల నీటిపాత్రను యీ ధర్మపాలుడు తాకిన చో జనసంఘములో నేను చెడినవాడగుదును. నేను లెక్కలేనంతమంది కులట స్త్రీలనుగూడి, వారి యుచ్ఛిష్టములదిని, త్రాగవచ్చును, గాని యీరాజుగారి సోదరియగు నుత్తమ కన్యారత్న మును వరింపరాదు. అట్లు చేసితినేని, నాకును యీ నారీతిలకంబునకును భ్రష్టత్వము వాటిల్లును. నేను దయాదాక్షిణ్య శాంత్యాదులులేక నీతిమాలి నవాడైనను చింతలేదు, గాని దిట్టముగ పట్టెనామ ములు బెట్టినం జాలును. సత్యశౌచాది సద్గుణ ములులేక జీవహంతకుడైనను, గడ్డము నివురుచు గూర్చుండుచు లేచుచు "లాహిలాహియిల్లల్లా మహమ్మదురసూలిల్లాహ" యని పఠించినచో ము ముక్షువగును. శమదమ సోదరభావాది ధర్మం బులు లేకున్ననేమి లోపములేదుగాని, లక్షణం బుగ బూదిబూసికొని రుద్రాక్షలం ధరించవలయు

ను. ఎంతని వివరింతును? న్యాయస్థానమున నబ
ద్ధ విశ్వాసమును, పుణ్యస్థానమున పాపమును,
విజ్ఞానస్థానమున నవిద్యయు, మిత్రస్థానమున ద్వే
షమును, సమత్వస్థానమున భేదమును, సుఖస్థా
నమున దుఃఖమును, స్వర్గస్థానమున నరకమును,
పరమేశ్వర స్థానమున జడములును, సత్కర్మస్థాన
మున దుష్టకర్మమును స్థాపనములై యున్నవి.

మహాశయులారా! ఇందులకు కారణమెండవ
లయునుగదా? అది హఠముగాక మరేదియుకా
దు. ఒకదినమందొక మహమ్మదీయుడు, బజారు
న రొట్టెనుగొని,తినుచు వెళ్ళుచుండగా, నొక కొం
తరొట్టెముక్క చెయిజారి నేలపై బడెను. వాడు
దానిని మరల తీసికొని, తినుటకు సంకోచించుచు,
నిలుచుండెను. అంతలో నొక మౌల్వీసాహేబు
గారురాగా, యాతనికీ విషయమై ప్రశ్నవేసి, పు
చ్చుకొనవచ్చునా? యని యడిగెను. అందుకు
మౌల్వీగారు, హిందువులు పుచ్చుకొందురా? యని
యడుగగా, వారు పుచ్చుకొనరని తెరువరి బదు

లుచెప్పెను. హిందువులకు వ్యతిరేకముగ నడుచు టయే—మనకు పరమ ధర్మము గనుక, తీసికొను మని చెప్పి వెడలి పోయెను. మతమతాంతరము లిటువంటి హఠముతో గూడియుండుట వలననే—అ హింసాధర్మమునకు విరోధముగ పశువధ యజ్ఞము లును, యేకేశ్వరోపాసనమునకు వ్యతిరేకముగ పలు విధములగు జడపదార్థ పూజలును, పరిశుద్ధమగు వైదిక ధర్మమునకు విరుద్ధముగ నపవిత్రమగు పురా ణ ధర్మములును, యీవిధముగ నెన్నియో విపరీ తములుత్పత్తియై ప్రబలమయినవి.

సభికులారా! ఇప్పుడు మన కర్తవ్యము—యీ పాపాచరణ పిశాచంబులతో బోరాడవలసినదిగా నున్నది. ఈశ్వరభక్తులగువారందరును సత్యపక్ష ముగా నీయుద్ధరంగమున జేరవలయును. ఇందు కు జడియకుడు! ఈ జనసమూహములో నాత్మగౌ రవమును కాపాడుకొని, సత్యసిద్ధాంతముల నవలం బించు ధైర్యశాలులెందరో – యుద్ధసన్నాహముల తో మనకంటె ముందు నడచువారు గలరు. వీరి

లో, తమ జీవనము నిమిత్తమేగాక, పరులమేలు కొరకై, సత్యావ్యాపకమందు దృష్టియుంచి, మన వెనుక వచ్చుకాల్బల మెంతయో గలదు. అనేకు లేవిధమైన భయమును జెందక, తమ శక్తిని, ఆత్మ ను, యీశ్వరార్పణముజేయు శూరవీరులెందరో మనచుట్టును నున్నవారు. అనేకులు, ధర్మమే-యమూల్యరత్నమని తలంచి, భగవన్నియమము లను, పాలించుచు, మనకు సంపూర్ణ సహాయము చేయు విద్వాంసులున్నారు. పరుల యభివృద్ధియే-మనయభివృద్ధియనెడు నుదారబుద్ధులెందరో-మనకు స్నేహితులై యున్నారు. కార్యాసక్తమైన కర శ్రేష్ఠములుగలవారెందరో-మనలను చేతులుచాచి పట్టుకొనువారు గలరు. హెచ్చరికయు, సూక్ష్మ దృష్టియుగల కన్నులతో మనల నెందరో కనుగొ నుచున్నవారు. మృదువై-విశాలమై-గంభీరమై-స త్యమై-పవిత్రమైన హృదయములుగల వారెందరో మనల నాశీర్వదించు చున్నవారు. ఇంతటి బల వంతులము, మరియు నీశ్వర సహాయముగల మన ము, యీ కల్పిత మత మతాంతరులకు, నీ విధి

తస్త్రిములగు జాతులకు, నీ స్వార్థులగు పురోహితుల కు, నీ శతాగ్రేసరులగు మఠాధిపతులకు, నీ పర వంచకులగు గురువులకు, నీ దురాచారులగు యా చార్యులకు, నీ యీశ్వర ద్రోహులకు, నీ మూర్ఖ మర్కటములకు జడియవలయునా?

శూర వీరులారా! యా-దురాగ్రహు లిచ్చెడు దూషణ పుష్పహారంబులు ధరింతము రండు! యా తుచ్ఛులర్పించెడు తిరస్కార తాంబూలంబులను స్వీకరింతము రండు! ఆ-కుటిలులు దయచేయు కు వాక్యగంధముల నలందుకొందము రండు! వారు పెట్టెడు ప్రహారాహారముల భక్షింతము రండు! ఇందుచే-మన మానమునకు హానిలేదు. ఒక మ హమ్మదీయుడు హిందువుపై, అత్యాచారములు స లిపి, తాను హిందువుని మానమును బోగొట్టిన, మాననీయుడని భావించునట్టి, యనర్థసమ్మానము మనకక్కరలేదు. మన మానము-శ్రీ సత్య హరి శ్చంద్రునికి తోడైన సమ్మానము. చంద్రమతీ దే వికి సహాయపడిన యుత్తమ మానము మన మా

నము. పాండవుల—నెడబాయకుండినది మన మానము. మనమానము — దుష్టులు దుర్మార్గులు నగు వారివలన తుడిచివేయబడ నేరదు.

సభ్యులారా! నేనీమతాంతరుల మధ్య నిలువంబడి “ఓ సోదరులారా! ఏకేశ్వరోపాసనము, సత్యభాషణము, న్యాయమైన వ్యవహారము, బ్రహ్మచర్యము, విద్యాధ్యయనము, పురుషార్థము, సత్సంగము, భూతదయ, పరోపకారము మొదలగు సార్వభౌమ ధర్మములవలంబించి, అసత్యము, అన్యాయము, వ్యభిచారము, అవిద్యాగ్రహణము, కుకర్మము మొదలగు నధర్మములను త్యజించుడు” అని చెప్పుచున్నాడను. ఈ మంతవ్యములనే—మతాంతరులైనను ఖండింతురేమో నిరీక్షింతముగాక! ఇందేమయిన గత్యంతర మున్నదా? ఇంతవరకు మన ము విన్నవానిలో— మంచిగుణము, యుత్తమకర్మము, శ్రేష్ఠవ్యవహారములను గురించి వింటిమా? అదెట్లుసాధ్యము? కటికవాడు భూతదయను గురించి యేమి తెలియును? యెట్లు బోధించును? అలా

గుననే సార్వభౌమ ధర్మమును చెప్పుటకు మతాం తరులొప్పరు. అట్టివానిని చదువరు; చదువనీయ రు; వినరు—విననీయరు; ముట్టరు—అంటనీయరు; పై గా సద్ధర్మపరులను వెక్కిరింతురు; సద్బోధకుల నవ మానపరుప జూతురు; పరిహసింతురు ; సభలలో తిట్టుదురు; సమయముచిక్కిన గొట్టెదరు; కొట్టిం చెదరు; విషము బెట్టుదురు—పెట్టింతురు; హత్య జే యుదురు—చేయింతురు; ధర్మవేషధారులగు నీయ ధర్మపరులతో—శిష్టనామధారులగు నీదుష్టులతో— నీరండాభుజంగబ్రహ్మచారులతో —నీకృత్రిమ ప్రవ ర్తక గృహస్థవానప్రస్థులతో—నీకపట సన్యాసుల తో—నీదాంభికయతులతో మనకు తప్పక దుఃఖము కలుగును; విరోధము పొసగును; తుదకు విజయ మును చేకూరును.

సత్యాభిమానులారా! మీరు పేక్షించిన యెడ ల, మీ సంతానములు నయితము, ఘోరము, న గాధమునగు, మతాంతరార్ణవములమునిగి పోయెద రు సుడీ! ‘‘ కర్తాయకారకాశ్చైవ ప్రేరితశ్చానుమో

దక। సుకృతం దుష్కృతంచైవ చత్వారిస్సమభాగి నః" యన్నట్లు మీరును తద్దోషభాగినులగుదు రుసుమీ! వివేకుల కొకమాటయే చాలియుండు న గాన నేనింతటితో విరమించుచున్నాడను.

## ధర్మపాలుఁడు

సభ్య సజ్జనులారా! మనకు పదార్థజ్ఞానము కావలసినప్పుడు, మొదట పదార్థముయొక్క పేరును, తరువాత దాని గుణమును, పిమ్మట దాని ప్రయోజనమును దెలియవలయును. భూమియను పేరును తెలుసుకొన్న మాత్రమున, దానిలోని పదార్థములు లభింపనేరవు. నీటి యావిరిని బాష్పమని తెలిసిన మాత్రమున, దాని స్వభావమును, బలమును, యుపయోగమునకుదెచ్చి, రైలుబండిని నడుపగలమా? అమరకోశమును కంఠస్థముచేసిన, విద్యార్థియెదుట, కుముదినీ పుష్పముంచిన, నిది కలువపూవని యెట్లు చెప్పగలఁడు? పదార్థగుణమెఱుంగని యొక శిశువుదగ్గర నొక సర్పమును విడ

చిన యెడల, శిశువు దానితో నాటలాడ గోరును. గనుక జ్ఞానమనగా ననేకులు దాని యర్థము దెలియక నున్నవారు. ఈలాగున, నీశ్వరుని పేరును మాత్రము దెలిసిన నేమియు ప్రయోజనంబులేదు. వాని సామర్థ్యమును, స్వభావమును, నియమము ను, వాని యాజ్ఞలను తెలియ వలయును. ఇంత మాత్రమున నుపయోగము లేదు. మనము మన తంద్రులను అథవా గురువులను ప్రసన్నుల జేయదలంచిన యెడల, వారియాజ్ఞలను పాలించుట ముఖ్యముగాని, వారి నామములు వల్లించుటవలన ప్రయోజనముండదు. ఇంతవరకు విద్యాలంకారులు చెప్పినట్లు మనము ఆశ్రమ పద్ధతుల ననుసరించి, వేదాది సత్య శాస్త్రముల నధ్యయనముచేసి, సత్యమైన, శుద్ధమైన, పవిత్రమైన, నిష్కల్మషమైన, ఛల-కపట - పక్షపాత-దంభ - అసూయాభిమాన స్వార్థలోభాది దుర్గుణ దూరమైన ప్రవర్తన గలిగి డాంభిక వేషములను వదలి, ఈశ్వరభక్తులై యుండవలయును.

మనము సూర్యుని ప్రార్థించినను, ప్రార్థింపకు

న్నను, మనపై సూర్యరశ్మి పడుచుండును. దేవు
డాలాగుననే, మనకివ్వవలసిన దానిని ప్రార్థించినను,
ప్రార్థింపకున్న నిచ్చివేయుచుండును. తాను
చేయు ప్రతి కర్మయు, నీశ్వరుడెరుంగునను నమ్మక
ము గలిగి, తనకు ప్రాప్తించినదెల్ల నీశ్వర ప్రసాద
మనుకొని, దుఃఖ శోకములందు భయభీతుడు గా
కుండ, సత్కర్మానుష్ఠానపరుడై యుండుటయే –
యీశ్వర ప్రార్థనోపాసనాదులుగా నుండును మ
తము లీసత్యపద్ధతిని పాడుచేసినవి. యథార్థము
గా–నేవి–నిషిద్ధ కర్మములో–నవియెల్ల, విధికర్మము
లుగా నాచరింప బడుచున్నవి. యేవికూడదోన
వి కావలెననుచున్నవి. వీనిని సమష్టిగా హిందూ
ధర్మమనీ పిలుచుట యోగ్యముగానే యున్నది.
హిందూశబ్దము సంస్కృతముకాదు. దాని యర్థ
ము ఫారసీభాషలో మిగుల నీచమై యున్నది. వే
దాదులందెచ్చట జూచినను, విద్యాదిబుద్ధి బలము
గలవారు బ్రాహ్మణులనియు, వారు మనుష్యసృష్టి
యనెడు, రూపమునకు శిరస్సునంటి వారనియు,
శారీరాది బాహుబలముగలవారు క్షత్రియులనియు,

వారు సృష్టియనెడు. రూపమునకు బాహువులవం
టి వారనియు, ధనబలముగలవారు వైశ్యులనియు,
వాయూరువులవంటి వారనియు సేవాబలము గలవా
రు శూద్రులనియు, వారుసృష్టికి పాదములవంటి
వారనియు, విశదమగుచున్నది. ఈ విషయమం
దు మతములు తలక్రిందులై పోయినవి.

ప్రాచీన గ్రంథాదులందు జూచినను, వారి చరి
త్రాంశములందును పూర్వీకులు తమ సంతతియొ
క్క స్వతంత్ర విచారములను బలవంతముతో నణ
చిపెట్టి బాధించుచు నష్టపరచుచుండ లేదు. మ
తములిప్పుడు విద్యార్థులను బంధింపజేసి యు
న్నవి.

పూర్వకాలపు బ్రాహ్మణులు తదితరవర్ణముల
వారిని, తమశరీరములలో నొక్కొక్క యంగముగా
భావించుచు, మానవసంఘమ్మును సుఖింప జేయు
చుండిరి. కర్దమఋషి, తాను బ్రాహ్మణుడైయుం
డి, రాజకన్యయగు దేవహూతిని వివాహమాడెను.
సౌభరి, విశ్రవా, జమదగ్ని, చ్యవన మొదలగు ఋ

షులు క్షత్రియులతో బాంధవ్యములు చేసిరి. బ్రా హ్మణస్త్రీయగు దేవయాని, క్షత్రియుడగు యయా తిని వివాహమాడెను. రామాయణములో శ్ర వణఋషియొక్క తల్లి శూద్రజాతియని చెప్పబడి నది. మనువు తన చట్టములో నిట్టి సంబంధము స్పష్టముగ విధించి యున్నవాడు. మతమతాం తరము లిప్పుడు వ్యభిచారమునకు స్వేచ్ఛాధికార మునిచ్చి, వివాహావృత్తికి పర్వతములవలె సడ్డము వచ్చి నిలుచుచున్నవి. బ్రాహ్మణులన్నచో —వై ద్యము తెలియని చికిత్సకులుగా నున్నవారు. వా రివలన లోకమున కేమి సుఖము కలుగును?

నేనొకతూరి యీకాలపు సన్యాసుల నొకరిని, "ఇన్ని మతములలో నేది సత్యమైనది" యని యడుగగా వారందుకు "ఒక గ్రామమున కనేక మార్గములున్నట్లు యన్నియు సత్యమైనవి" యని బదులు చెప్పెను. ముక్తి స్థిరమై—యానందదాయ కమై—నిరుప మానమై— యగోచరమై యున్నది. గారిమము జడమై—యేకదేశీయమై- దుఃఖాన్వితమై

అస్థిరమై యున్నది. ఇట్టి యవిద్యాజన్యమగు ను పమానములు జెప్పెడు శాస్త్రిజ్ఞానవిహీనులు స న్యాసులైనప్పుడు మనకు సత్యమెట్లు లభించును? ఒకతూరి మాయాచార్యులతో వర్ణమునకు గుణ కర్మస్వభావములు ముఖ్యమను విషయమును మా టలాడుచుండగా నొక శాస్త్రిగారు "తెల్లకుక్క నల్లకుక్క కానేరదు; నల్లకుక్క తెల్లకుక్క కానే రదు" అని చెప్పి తన శూద్రత్వమును స్థిరపరచు కొనెను. మాయాచార్యులు శాస్త్రినిజూచి, మీ రేకుక్కలని యడుగగా, నామూర్ఖుడంతటితోనైన తెలివిదెచ్చుకొనక తెల్లకుక్కలని బదులు చెప్పెను. ఆచార్యులప్పుడు "ఓ కుక్కా! నీవు యెంగిలి విస్తరులను వెదకుచుండక, యిక్కడ కూర్చుంటివి?" యని వెళ్ళగొట్టెను. నలుపు తెలుపు రంగులు ప్రత్యక్షమున తెలియునట్టి సాకారములుగా ను న్నవి. బ్రాహ్మణాది వర్ణములు గుణసంబంధమై - నిరాకారమై యున్నవి. కుక్కలను చూచిన త క్షణమే - నల్లనిదిది, తెల్లనిదిది, యని తెలియున ట్లు మనుష్యుని జూచిన తోడనే, వీడు బ్రాహ్మణు

డని తెలియుట సాధ్యమా? యొకని హస్తమును కత్తరించి సభయందుంచిన నెవరైన నిది బ్రాహ్మణ హస్తమని, శూద్రుని యంగమని చెప్ప గలుగుదురా? తెల్లనివారందరు బ్రాహ్మణులు నల్లనివారందరు శూద్రులనవచ్చునా? ఇటువంటి యవివేకులు శాస్త్రులై కూర్చున్నప్పుడు, యిట్టి విద్వాంసులగు విద్యాలంకారులను గౌరవించువా రెవరు? లోకమెట్లు బాగుపడును?

సత్య సనాతన ధర్మమవలంబింప గోరువారందరును, మతాంతర పిశాచములను దూరముగ తరిమివేసి, తమయమిత ప్రతాపమును భగవంతుని యెదుట ప్రకటించి తమ జన్మములను సార్థక పరచుకొనెదరుగాత! యని విన్నవించుచు చాలించుచున్నాడను.

రాజు.

సజ్జన సామాజికులారా! మా భారత దేశ మెట్లున్నది? అది యున్నతిమీద నున్నదా? అథవా

యవనతిపై నున్నదా? ఈశ్వరుడు చేతనుడు సర్వ జ్ఞుడుకాడా? అయితే యాతనిని జడమని అల్పజ్ఞుడని యెట్లు చెప్పగలరు? ఈ విషయమై మనము హఠము సాధించుట యుక్తమేనా? మనలనే మాత్రము నెదిరింపజాలని మనకు మహోపకారమైన సాధు జంతువుయొక్క తలను కరకర తరిగి వేయుటకై గొప్ప ధర్మమును జేయువానివలె శూరవీరుడై లేచి వచ్చుటయు, నా పనిని జేసి యానందించుటయు, పరాక్రమమని సభికులెవరైన చెప్పగలరా? చెప్పజాలరుగదా? చెప్పువారున్నచో యిటురండు! మీ యంగములలో నొకదానిని ఖండించుకొని మీ యనుభవమును పరీక్షించుకొనుడు! అట్లు చేయజాలరేని, మీకు దురాగ్రహముతో గూడిన హఠముండుట నరకహేతువని నమ్ముడు. దేశోన్నతి, జనోన్నతి, ఆత్మోన్నతి, యీ మూటిని మనవశముండనుండుడు! వీనిలో నెద్దాని సీమతాంతరములభివృద్ధినొందించినవి? కన్నులు తెరచి చూడుడు! మరల మూసికొని ధ్యానించుడు! యీ మూటిని నాశనముచేసినదెవరు? నిష్పక్షపాతముగ దెల్పుడు!

అనేకులు కాలమును నిందింతురు. మన మెట్లు న్నారమో కాలమట్లున్నది. ఒక దొంగను శిక్షించువారెవరు? కాలమా? లేక న్యాయాధిపతియా? అథవా నావిలోపమా? ఈ లోకము సహజముగా మన భావేచ్ఛ సంకల్ప యాకాంక్షాదుల ప్రతిబింబ మైయున్నది. నీకునీవే బంధువు నీకునీనే శత్రువని కృష్ణుడు చెప్పియున్నాడు. ఈ దినములు మనజీవితముయొక్క గ్రంథపు పుటలుగా నున్నవి. మన సుఖసంపదలకును మోక్షమునకును, యాపుటలలోని, చరిత్రాంశము లాధారములై యున్నవి. యా చరిత్రకు, సత్యత, పరోపకారము, బుద్ధి, పిన్నలయందు వాత్సల్యము, పెద్దలు అనగా సజ్జనులయందు భక్తి, దుష్టులయందు నుపేక్ష, శిష్టులయందపేక్ష, యిత్యాది గుణము లాధారములై యున్నవి.

అదృష్టమను శబ్దమును మనము సదా నుపయోగించుచున్నారము. దానిని గురించిన జిజ్ఞాస మనకావంతయును లేదు. మన దృష్టికి మనస్సునకు నాత్మకు తెలియని సుఖదుఃఖప్రాప్తికి యదృ

ష్టమని పేరు. దానిని నిర్మించువా రెవరు? ఈర హస్యము తెలిసిన వానిని దేవుడని నేను భావించు చున్నాడను. వాడే విద్వాంసుడు; అతడే పండి తుడు; అతడే మానవుడు; అతడే భాగ్యవంతుడు; అతండే ఈశ్వరభక్తుడు. అతనియందు పభ్యత, సాధుత్వము, పవిత్రత, ఉదారత, ఆత్మశాంతి, పరి పూర్ణసిద్ధి, సౌభాగ్యములన్నియు నిండియుండును. అతండు ధన్యుండు. మాన్యుండు.

మహాశయులారా! మతాంతర కర్మలన్నియు వ్యర్థమై—యనుచితమై యుండుటయే గాక మనశక్తు లనన్నింటిని నాశము చేయుచున్నవని విద్యాలంకా రులు సూచపరచిరి. ఇట్లు మనలను విధ్వంసము చేసి పాపముల నంటగట్టుచున్నవని మన మేమా త్రము తెలియలేకున్నారము. ఇవి మనపిత—పితా మహ—ప్రపితామహుల నెందరినో యధమస్థానము నకు జేర్చి యున్నవి. తన తప్పితములను తన శిర స్సుననుంచుకొను వాడధఃపాతాలమునకు దిగక పైకెట్లు పోగలడు? ఈ రహస్యము మనకు దెలియ

వలయునన్న, స్థూలప్రపంచ వివేచనకంటెను, సూక్ష్మప్రపంచ వివేచనము చేయుటకభ్యసింప వలయును. అప్పుడు నీచుట్టును ఆత్మసంబంధమైన మృదువాయువు వ్యాపించును.

ధర్మప్రియులారా! అందరికిని సుఖమందత్యంత యభిలాషగలదు. అయితే దానిని సంపాదించి యిచ్చువాడెవడని యొక్కరును యోచించినట్టు లేదు. ఈ న్యూనతమాత్ర మధికముగా నున్నది. సుఖమునుగోరు ప్రతివాడును ఆత్మవశుడు గావలయును. మతాంతరములిందుకు గర్భశత్రువులై యున్నవి. మన మానసములో ప్రవేసించిన యథార్థ జ్ఞానసంకల్పములు మన యనుభవరూపమున బైటరావలసి యుండును. ఇది సుఖాధారము. మిథ్యాజ్ఞాన సంకల్పములు దుఃఖహేతువులు. గాన, కాలలోప మేమియులేదు.

• ధర్మాభిలాషులారా! ఎట్టి లోపములును లేని భర్త గలిగియుండియు, వ్యభిచరించినట్టి పామరస్త్రీని జూచినప్పుడు మీరేమి చెప్పుదురు? కాలమహిమ

మని యనుట యోగ్యమా? నూరులకొలది జీత ములు వచ్చుచుండియు లంచములను గ్రహించు నుద్యోగస్థునిగురించి యేమి చెప్పుదురు? కాలదోషమందురా? లోకమున పతివ్రతలు లేరా? న్యాయపాలకులు లేరా? వారిని జూచినప్పుడు మాత్రము కాలధర్మమని బలికెదరా? ఈ యాసర్థమునకు యథార్థ జ్ఞానశూన్యమని సాహసించి చెప్పుచున్నాడను. మానవుడు తన బుద్ధిని—బలమును—అంగములను—న్యాయముగ నుపయోగించినచో, తన యాత్మ రక్షణము జరుగుచున్నదను నమ్మకమును పాడుచేసి, అక్రమ ప్రయోగముల నలవాటు పరచినదెవరు. ధర్మమును స్వప్నముననైన దలంచక, కర్తవ్యాకర్తవ్యముల నెంచక, ధనమార్జించువారిని పరీక్షించుడు. వాడు నారికేళతాంబూల కర్పూర దక్షిణల దీసికొని గుడికి వెళ్ళి, అన్నియు సమర్పించి నా పాపములనెల్ల బోగొట్టుకొంటిని, నేను ధన్యుడనైతి ననుకొని యానందించును. ఇట్టివాడెట్లు సూక్ష్మమగు నీశ్వరీయజ్ఞాన మెఱుంగును? ఒక కుల టస్త్రీ తడిగుడ్డ గట్టుకొని రాగిచెట్టును చుట్టివచ్చి

పుణ్యాత్ము రాలైతినని భావించుకొనును. నేను చె ప్పినదానినే మరల చెప్పవలసినదెందుకు? ఇప్పుడు మత మతాంతరులందరు శుద్ధ నాస్తికులని మీకు విస్పష్టమైనదా? తామాచరించిన పాతకములను తామే నివారణ చేసికొనగల శక్తి గలవారికి దే వునితో పనియేమి? దేవుడు వీరియాజ్ఞానువర్తియై వీరు కోరినదెల్ల సమర్పించువాడైనచో దేవుని య ధికార మేమున్నది? జ్ఞానమనగా నేమో విద్యా లంకారులు చెప్పిన దానిని స్మరించుకొనుడు. దే వుడున్నాడని తెలిసికొనుట మాత్రము జ్ఞాన మెప్ప టికిని కానేరదు. అందరికి తండ్రియు, పతియు, పాలనకర్తయు నొక్కడని తెలిసి నప్పుడుగదా— వానికి యేదేశవాసియైనను, యేజాతివాడైనను, ప రుడుగానగుపడక ద్రోహముజేయక, దయగలవాడ గును? ధర్మానుష్ఠానము తెలిసినంగదా పాపాను ష్ఠానమును త్యజించును? ఎంతమంది యట్టివారు న్నారు? దలంచగా హృదయము విదీర్ణమగుచున్న ది, ఎచ్చటజూచినను శూన్యమే ప్రతీతమగుచున్న ది.. నా మొదటిప్రశ్నలకిదే తగిన ప్రత్యుత్తరము.

గుణగ్రాహ్యులారా! యీ మతాంతర శవములను దహింపజేయకున్న నీ కళేబరంబులు కుళ్ళి లోకమంతయు పాతక దుర్గంధములతో నిండి పోవును. గాన వీనికి దాహసంస్కార మవశ్యముగ జేయుదురని, యనేక విధముల వేడుచున్నాడను.

సంఘీయులారా! మానవుడు తనది కాని దానిని తనదియని గర్వించుచున్నాడు. దీనిని దెలిసినవాడే— వైరాగ్యముగలవాడు. తనకేది ముఖ్యముగ గావలయునో, యది యెచ్చటగలదో, దానిని గురించి యోచించడు; ఈ లోపమును తిద్దుకొనువాడు ముముక్షువు. తన ధన్యతకు యోగ్యము నాధారమగు దాని లక్షణములను దెలియడు. దానిని దెలియుటయే—జ్ఞానము. తన యాత్మరక్షణాధారమగు దానిని తెలిసిన తర్వాత సర్వవిధముల సంపాదింపడు. దానిని తప్పక సంపాదించుటయే— ముక్తి యనబడును.

యనుంగులారా! మనగతియెట్లున్నది? ఒక వర్తకుడు రత్నములు మొదలగు నుత్తమ పదార్థ

ముల దీసికొని వ్యాపారముకొర కొకనగరములో
ని ఛత్రమున ప్రవేసించెను. అచ్చట వానికి గాం
జావనమును బంగీ బైరాగులును దండిగాలభించినం
దున, దానిని నానావిధముల సేవించెను. తుద
కు వాడు దంతధావనము చేయవలసినచో, భాం
గుఫ్ల్ల కావలెనని వెదకి దానినే సంపాదించి తృప్తి
డగును. ఇందువలన నతండెల్లప్పుడు తూగుచు
వాలుచుండుటగని, యా పట్టణములోని బాలురు,
వానిని పిచ్చివానిగా దలంచి, కిటకీలగుండా చిన్న
మట్టిపెళ్ళలతో గొట్టనారంభించిరి. వర్తకుడు మ
ఱల వారిపై రాళ్ళు ఱువ్వచూచెనుగాని మట్టిముం
డలు పగిలియుండెను. గనుక వాడు తనయొద్దను
న్న నవరత్నములతో బాలురను వేయదొడంగె
ను. రత్నములన్నియు ముగిసినవి. బాలురు వా
నిని తీసికొని పరుగిడిరి. వర్తకునికి కొంత సేపటికి
మైకముదిగి కొంచెము వివేకము గలిగినందున, తన
యమూల్య రత్నములు పోయినందుకు ఖిన్నుడై
"ఆహా! నేనెంతటి వెఱ్ఱినైతిని? సుతులకొరకై వచ్చి
పతిని పోగొట్టుకొన్నట్టు లాయెనే! నేను నాపదా

ర్థములకు బదులేమి గొనిపోవలెనని వచ్చితినో, యి
ది లభించుటకుబదులు, నా స్వంతభాగ్యమెల్ల గో
లుపోతినే!" యని దుఃఖింపసాగెను. వాడెంత
యేడ్చిననేమి? మరిఖమునినా మఱేమియు వానికి
లభింపలేదు.

ప్రియ సోదరులారా! యా వర్తకుడు మన జీ
వాత్మయే. ఇతడీశ్వరాజ్ఞానుసారముగ ముక్తినిగొ
నుటకై, యీలోకమునకు, తన యుచ్ఛ్వాసనిశ్వా
సరూపములగు రత్నములతోవచ్చి శరీరమను ఛత్ర
మునప్రివేశించెను. ఈజీవుడు మతాంతరరూప గ్రాం
ణావన ప్రవేశమునను, తత్ప్రివర్తక జనసాంగత్య
మునను ప్రమత్తుడై భ్రమించెను. ఈ మూర్ఖుని
నింద్రియరూపములగు బాలురు, తను విషయరూప
ములగు మట్టిపెంటలతో గొట్టిరి. అవి నాశోన్ము
ఖమైనవి గావున నశించి పోయినవి. వీడును ప్రతి
క్రియగా, తన శ్వాసరూప రత్నములతో వేయు
చు, వానిని పాడుజేసెను. తాను—స్వస్థానమున
కు వెళ్ళవలసిన కాలమాసన్నమాయెను. అప్పు
డు వాడు వివేకముగలవాడై మిక్కిలి దుఃఖించెను

గాని సమయము మించినందున దుఃఖమంతప్ప మరే మియు సంపాదింపజాలక పోయెను. మనగతి యీ లాగున నున్నది.

శ్రోతలారా! యీలాగున మనమిప్పటి కెన్ని యో రత్నములను వ్యర్థపరచి యున్నారము మి గిలియుండునీయల్పముల నైన సార్థకపరచిన యెడల, మనము సంపాదింప పూటబడి యుండినదానిలో— నేయల్ప భాగమునైన పొందవచ్చును. మీ విద్య- మీ ధనము— మీ యధికారము— మీ శరీరము మొదలగువానిని గురించి దీర్ఘముగ నాలోచించు డు. నే జెప్పదలంచిన దానింజెప్పితిని. ఇది య రణ్య రోదనమని మీరనవచ్చును. నాకట్టి యా శాభంగ మున్నచో మాటలాడియుండను. నేను పశువుల గుంపునందు ప్రసంగింపలేదు. "నీజ్ఞాన మే స్వర్గము నీ శరీరమే కల్పవృక్షము. నీవు నే ర్చినవిద్యయే కామధేనువు. యథార్థజ్ఞానమే య మృతము. తత్పాలనమే మోక్షముగా నీకు దెలి సినదిగదా యని నే సంతసింపజాలను; నీ సుధార ణమంతయు నాచరణములో నున్నదిగాన, దాని

ని జూడవలయు " నని మద్గురువరులుప దేశించిరి. దీనినే నేను మీకు విన్నవించితిని. వెయ్యిమాట లేల? మనము క్రొత్త జన్మముల నెత్తవలయును.

విదూషకుడు.

హరహరా! యిదెటువంటి రాజాజ్ఞ? ఇప్పుడం దరు చావవలయునా? అయ్యో—నే జావలేను. చచ్చునప్పుడెంత కష్టము? సార్వభౌమ ధర్మమ నగా పాయసమువలె తియ్యగా నుండు ననుకొంటి ని. దీనిని మాయమ్మ సమ్మతింపదు. నాభార్య విన్న చీపురుకట్టతో పూజించును. ఉత్తచావైన ను గాదు. క్రొత్తగా పుట్టవలయునట! కన్ను లు మూసికొని చావవచ్చునుగాని జన్మించుట యెం తకష్టము? అందులో నిప్పుడే చావు నిప్పుడే పుట్టు కనా? యిట్లని తెలిసియుండిన నేనీసభకు రాకనే యుందును. ఏదీ—దీనికి సమ్మతించినవారు చేతు లెత్తుడు చూతము! ఓహో! యెంతమంది సిద్ధము గ నున్నారు? మంచిది యెట్లు చావవలయునో నా కు తెలియదు. దానిని నేర్పువారెవరు? నేను మరల పుట్టకపోయినయెడల జవాబ్దారులెవరు? అం

దుకు మీలో నొక్కరు పుట్టబడవలయును. యె
వరు ముందు చావవలయును? నేనుగాదు గదా?
నేను దినదినము కొంచెము కొంచెముగ చచ్చుచు
న్నాను. నేనెప్పుడును చచ్చి యనుభవించి యుం
డలేదు.

రాజు.

అయ్యా! దిగులుజెందకుము. పాపమునుండి
పవిత్రమునకు మరలుట-క్రొత్త జన్మముతో సమా
నమని చెప్పితిని. నీవు చావవలసిన పనిలేదు. మ
తాంతరములను చంపవలయును.

విద్యాలంకారుడు.

స్వాదిష్టపదార్థములు స్వీకరించుచు మలమూ
త్రముల విసర్జించుచుండువాడు జీవుడు అథవా ప్రా
ణసహితుడని చెప్పబడును. ఇది లేనప్పుడు శవమ
ని చెప్పబడును. మంచిని గ్రహింపకను చెడ్డను
త్యజించక నుండువాడు నదేప్రకారముగా పీనుగ
యనబడునుగాని వేరుగాదు. మతములాలాగు
ననే యున్నవి గావున నవి చచ్చిన కళేబరములు
గానున్నవి. గనుక మతమతాంతరములును, మ

తస్థులును, శవములని సిద్ధాంత మైనది. వీని కం
త్యకర్మము మాత్రము చేయవలసి యున్నది. వి
దూషకా! దాహసంస్కారము జేయుము.

విదూషకుడు.

ఓమగ్నయేస్వాహా! ఓం సోమాయస్వాహా!
ఓం లోకాయస్వాహా! ఓ మనుమతుయేస్వాహా!
పృథివ్యైస్వాహా! అంతరిక్షాయస్వాహా! వాయ
వేస్వాహా! దివేస్వాహా! సూర్యాయస్వాహా!
దిగ్భ్యశ్స్వాహా! చంద్రాయస్వాహా! నక్షత్రేభ్యః
స్వాహా! అద్భ్యః స్వాహా! వరుణాయస్వాహా!
మతాయస్వాహా! మతశాఖాయస్వాహా! ప్రశా
ఖాయస్వాహా! శోచతేస్వాహా! శోచమానాయ
స్వాహా! శోకాయస్వాహా! యమాయస్వాహా!
అంతకాయస్వాహా! మృత్యువేస్వాహా! విశ్వేదేవే
భ్యఃస్వాహా! ద్యావాపృథివీభ్యామ్ స్వాహా! శత్రు
హాత్ర్యైఃస్వాహా! సర్వంవై పూర్ణంస్వాహా!

(భజన)

ఆరతి.

ఓమ్ జయజగదీశహరే । ఆనందదాతగురంవే ॥ప॥

భక్తజనార్త నినాద నివారక—సోక్తశ్రుతిసంపా
దక బోధక ॥ ఓమ్ ॥ ॥౧॥

సత్యగుణాకర నిత్యనిరంజన— శత్రువినాశక అర్థ
సుసాధక ॥ ఓమ్ ॥ ॥౨॥

యుక్తనియామక ముక్తిప్రదాయక—శక్తివివర్ధక
నానందాత్మక ॥ ఓమ్ ॥ ॥౩॥

విశ్వవినోదా వినయవిధిప్రద—విశ్వవిలాసక వివి
ధాధారక ॥ ఓమ్ ॥ ॥౪॥

ఆర్తినివారక అఖిలవ్యాపక । ధూర్తవినాశక—
మూర్తిప్రియాత్మక ॥ ఓమ్ ॥ ॥౫॥

ఇది శ్రీపరమేశ్వర కరుణా కటాక్ష వీక్షణపాత్ర,
యల్లమరాజవంశ జలనిధిసోమ గురుమూర్తి
పుత్ర, విబుధజనమిత్ర నారాయణమూర్తి
ప్రణీతంబగు భారతసూర్యోదయనాటకము
సంపూర్ణము.



# శుద్ధాశుద్ధ పత్రము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 1 | న్యాయుత | న్యాయః |
| ,, | 9 | బ్రహ్మె | బ్రహ్మ |
| 4 | 6 | నొటికి | కోటికి |
| ,, | 7 | సలు | నలు |
| ,, | 12 | చుస్న | చున్న |
| 6 | 2 | నూరె | మారె |
| 2 | 6 | ఏన్ని | ఎన్ని |
| , | 18 | జోలిలో | జోలిల |
| 15 | 3 | దక్షుడు | పక్షుడు |
| ,, | 5 | గలియక | గలువక |
| 19 | 15 | విజ్ఞప్తి | విజ్ఞప్తి |
| 25 | 7 | లసు | లను |
| 27 | 8 | మేక | మైక |
| 38 | 7 | నా | వా |
| 51 | 15 | తిసు | తను |
| 54 | 12 | నాఫ్ | సాఫ్ |
| 55 | 16 | యుంశు | యుండ |
| 57 | 4 | ఏట్రి | ఎట్రి |
| 70 | 2 | ముడగి. | ముడిగి |
| ,, | 18 | స్నతి | న్నతి |
| ,, | ,, | న్నత్సు | సత్సు |
| 71 | 13 | త్వరిలో | త్వరలో |
| 72 | 5 | ఆది | అద్రై |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| 80 | 3 | కొల | కొన |
| ,, | 4 | బన | బస |
| ,, | 9 | నాం | సాం |
| ,, | 16 | ప్రమా | ప్రమా |
| 88 | 9 | వేద | వెద |
| ,, | 17 | పడు | పడ |
| , | 18 | స్వాడు | ప్పాడు |
| 101 | 13 | వినము | వినుము |
| 102 | 7 | పుఁ | పుం |
| 108 | 16 | వానిరి | వారిని |
| 114 | 3 | మంత్రో | మంత్రో |
| 117 | 16 | యేటికిలవ్రతములివియొ — | |
| 149 | 10 | సడును | పడును |
| 162 | 2 | మవపా | మనసా |
| ,, | 10 | నోధర | నోదర |
| ,, | 12 | సమః | నమః |
| 175 | 8 | జూడము | జూడుము |
| 176 | 9 | కవట | కపట |
| 177 | 13 | మైస | మైన |
| 179 | 17 | మోల్వీ | మాల్వీ |
| 189 | 9 | బ్రాహ్మ | బ్రాహ్మ |
| 194 | 10 | శకు | శక్తు |
| 203 | 17 | యస | యన |
| 204 | ,, | న్యాహా | స్వాహా |

## ప్ర క ట న.

సత్యాన్వేషకులారా! దేశమును నానావిధము ల బాధచేసి యధోగతికి దెచ్చుచున్న ఫలిత జ్యోతిషమును గురించి, "పి తృ లో క మ హా స భ" యను పేరనొక గ్రంథము వ్రాయఁబడినది. అందు వేదాంగమగు సూర్యసిద్ధాంతాది గణితజ్యోతిషము వేరనియును, కల్పితమును, మిథ్యయు, అనర్థమునగు ఫలశాస్త్రము వేరనియును, అది సనాతనముగాక యవనులనుండి వచ్చినదనియును, వేదవిరోధమనియును, దేశ–జన–ఆత్మోన్నతులకు భంగమనియును, ఫలములెట్లుకావలసిన నట్లు సరిపోవు చమత్కారముగలదనియును, దీనివలన పురుషార్థము నిష్ఫలమైనదనియును, ఫలశాస్త్రజ్ఞులు దానిని నమ్మకజీవనాధారముగనవలంబించిరనియును, భవిష్యద్జ్ఞానమునకు యోగము జ్ఞానము సాధనములుగాని ఫలశాస్త్రముకాదనియును, దీనివలన ఘోరవిపత్తులు గలుగుచున్నవనియును, అది పూర్వాపరవిరోధమనియు, అసంభవమనియు నిరూపింపఁబడి, అనేక పుష్టప్రమాణములతోడను, శాస్త్రచర్చలతోడను, శంకా సమాధానములతోడను వ్రాయఁబడినది. యశఃకాములెవరైన దీనిని ముద్రించుటకు (300)

మూఁడువందల రూపాయలు సహాయము చేసినయె డల, గ్రంథము వారికంకితముచేయఁబడి, ఆ చంద్ర తారార్కముగ వారికీర్తిఖ్యాతులను స్థిరముగ నుం డునట్లు చేయుటయేగాక వారికి (100) నూరుప్రతు లు బహుమతి చేయుచున్నారము.

ప్ర హ స న మం జ రి

ఇది హాస్యరసప్రధానముగ, సంఘ—మత—నీతి— ఆచార —ఆశ్రమ— జాతి— కుటుంబ— వ్యవహార— ఉ ద్యోగాదులనుగురించి, దేశజనాభ్యున్నతులకుదగి నటుల వ్రాయఁబడినది. ఎంతటిదుఃఖసమయమం దైనను నవ్వించునట్టిది. దుర్మార్గమునుండి సన్మార్గ మునకుఁద్రిప్పునట్టి ప్రభావముగలది. దీనిని ముద్రిం చుటకు (200) రెండువందల రూప్యములు పట్టును. పైపద్ధతిప్రకారమే దీనిని ముద్రింపదలఁచినారము. ఈ రెండుగ్రంథములును మిగుల లోకోపకారమైన వి. కనుక సత్యసనాతనమగు వైదిక ధర్మరక్షణా తత్పరులగు మహనీయులిందుకు సహాయపడుదురని ప్రార్థించు,

అర్య—నారాయణమూర్తి,
హిందూపురం,
అనంతపురం జిల్లా.

౫. సర్వకార్యములను ధర్మానుసారంబుగా సత్యాసత్యములను విచారించి సల్పఁదగును.

౬. లోకోపకారమొనరించవలసినదియె ఈ సమాజముయొక్క ముఖ్యోద్దేశ్యము; అనఁగా శారీరకాత్మిక సామాజికముల యున్నతి సలుపవలయును.

౭. అందఱియెడఁ బ్రీతిపూర్వకము ధర్మానుసారము యథాయోగ్యమనువర్తింపఁదగును.

౮. అవిద్యానాశమును విద్యావృద్ధియుఁ జేయఁదగు.

౯. ఒక్కొక్కరుఁ దమ యున్నతియందే సంతుష్టులుగాఁ జనదు కాని, ఎల్లర యున్నతియందుఁ దమ యున్నతి నెన్నఁదగును.

౧౦. మనుష్యులెల్ల సామాజిక సర్వహితకారక నియమపాలనమునఁ బరతంత్రులయి యుండఁదగును; మఱియు తమతమ హితకారక నియమములయెడ నెల్ల స్వతంత్రులుగానుండ నొప్పును.

శ్రీ ర స్తు.

# వేంకటరమణశతకము.

శ్రీమద్వేంకటగిరివర । ధాముడవై జగతిభక్తతతికామి
తముల్ । ప్రేమతో నొసగెడుసామీ । వేమరు రక్షించు
కరుణ వేంకటరమణా ॥ ౧ ॥ నెమ్మదిలో నిశ్చయముగ ।
నమ్మితి నీపదయుగములు నామనవి దెగై । కొమ్మీ వేరమ్మీ నీవి
మ్మీ నాకోర్కె కరుణ వేంకటరమణా ॥ ౨ ॥ అనుమానమే
లమీపద । వనజంబులమీదిభక్తివదలనుయికచే । కొను
మామమునుమాకృప । వినుమానామనవిగరుణ వేంకటర
మణా ॥ ౩ ॥ చక్రాయుధధరమాధవ। శక్రాదిసురేంద్రవినతచ
రణయుగళభూ । చక్రభరణనక్రహరణవిక్రమరణకార్యనిపు
ణ వేంకటరమణా ॥ ౪ ॥ జపములచేతపములచే । నుపముల
చేమిమ్ముగొలువనెకరికిదరమా । కృపనీకురాకసేవక ।
విపదంభోరాశితరణ వేంకటరమణా ॥ ౫ ॥ అపరాధము
లక్షవాదము । లపరిమితమవజ్ఞుడనుచు నాశ్రితునిపయిగా ।
నెపమేలర కృపనేలర । విపదారణ్యత్రిచరణ వేంకటరమ
ణా ॥ ౬ ॥ ద్విజరాజధ్వజరాజ । వ్రజమకుటమణిప్రభావి
రాజితపాదాం। బుజయుగళభక్తజనఘన । వృజనాళివిపిన
దహనవేంకటరమణా ॥ ౭ ॥ పాషాణరూపయోషా । దో
షాశేషప్రశోషదురితౌఘతమః పూషామునిపోషామృదు।
వేషామరవంద్యచరణ వేంకటరమణా ॥ ౮ ॥ మతిలోనిను

చింతించెద । క్షితిజాకుచకుంభలిప్తసిందూరరక్తాం । కిత
రాగహారభూషణ । వితతభవాంభోధితరణ వేం॥ ౯॥ పా
కాంతకగీఃకాంతసతీకాంతానాథముఖ్యదివిజార్చ్చి । తను
శ్రీకరచరణద్వయద । ర్వీకరరాడ్భోగశయన వేం ॥ ౧౦॥
పాతకహరదైతేయవి । ఘాతనకరదివిజతురగకల్పకధర్మ
ణీ । జాతసుధాసితాంశు । శ్వేతయశఃసాంద్రకిరణ వేం॥
పంచశరజనకరిపుగజ । పంచాననసనతవిధీంద్రపంచాననని ।
న్నెంచెదచింతించెదసే।వించెదభవబంధహారణ వేం॥౧౨॥
సమరనిహతామరాహిత। భ్రమరానతచరణకనకరచితా
భరణా । కమలాననకమలారుణ । విమలగుణాన్వితసుధీన
వేం ॥ ౧౩ ॥ దేవేశనామనవిగై । కోవేనీపాదభజన
కోరితిచేకో । రావే । సిరులీవేదయవేవేజగదేకభరణ
వేం ॥ ౧౪ ॥ పాతకదనుజానుజుని । హ్లాతుకగృపబ్రోచి
నాడవేమిమహిమరా । ఖ్యాతివినిరొబీఁచెననిరొ । ఖ్యాతి
గనిరొదెలుపుమయ్యా వేం ॥ ౧౫ ॥ అనవరతంబునుసు
కృతంబనెడువ్రతంబాచరించునార్యునిగాచే। పనివింటిక
గనుగొంటిక । వినుమంటినాన్నదుమనవి వేం ॥ ౧౬ ॥
ఆపదలంబాపదలపు । మాపురుషోత్తమమహాప్రభోనమ్మి
తిరా । నాపట్టైచెపట్టే । వీపట్టులనైనగరుణ వేం ॥ ౧౭॥
రాపాడకకాపాడక । మాపాలనుగలుగవయ్యానుంజులర
సస।ల్లాపానతగోపాపృథ్వీపాలనగార్యభరణ వేం॥౧౮॥
పంతముతేనాతోటియ । నంతజనార్దనముకుందసనుగావ
గనీ । మొంతటరాయింతటరా । వింతటరాదాసునెడల
వేం ॥ ౧౯ ॥ ఈశసురాధీశవినుత । వేశరణొందితిని

గావునీలాంబుదసం । కాశరథకీశవరదా । వీశరథద్రిలో
కనాథ వేం ॥ ౨౦ ॥ కింకరజనశంకరమీ । నాంకధ్వజజ
నకద్రిభువనావనయిదెనా । వంకంనిశ్శంకంనీ । వింకంగ
నవేమిగరుణ వేం ॥ ౨౧ ॥

* భారతకథానుగుణ్యమైనపద్యములు. *

అగ్గికిరుజతగ్గజవ । మగ్గలముగసేయనిర్జరాధిపువనముగా ।
గ్రుగ్గించితిబాగ్గునిచే । బెగ్గడిలగసురలుజూచి వేం ॥ ౨౨ ॥
ఖలులగుధృతరాష్ట్రాత్మజు । లలద్రౌపదిచీరెలూలువయా
సతిమదినిగా । దలచిన మొల మొలచినక్రియ । విలసత్కృప
వలువలీవె వేం॥ ౨౩ ॥ వథజెందరెసురుబలమతి । రథికమ
హారథులుధర్మరాట్సుతుచేపె । న్నిధివై సారథివై బహు ।
విధములనరునీవుగవియ వేం ॥ ౨౪ ॥

* భాగవతకథానుగుణ్యమైనపద్యములు. *

శ్రీవర్థిలయదుకులమున । దేవకివసుదేవులకుసుధీవినతుడ
వై । యావిర్భవించితానీ । వేవేల్పులుసంతసిల్ల వేం
కటరమణా ॥ ౨౫ ॥ బలులగుకంసప్రముఖా । ఖలరిపు
లసాంచదేవకీవసుదేవుగా । తొలినోముఫలముగననీ । విల
జన్మించితివిగాదె వేం ॥ ౨౬ ॥ తలపులుతుంపెసలాడగ ।
తలపులతాళంబులూడతగనిద్రనియా । బలురాతిరివసుదే
వుడు । విలసిల్లుచుమందజనడె వేం ॥ ౨౭ ॥ నందుడును
యశోదయునా । నందపడగానందనుండనందగినోగియా ।
నం ద్గాయాబృందగాగోవిందుండన మెలగితౌర వేం॥౨౮॥
పాతకిసురఘాతకియగు । పూతకిచనొన్డసికుడిచిపుకిట

తదను । ప్రాతములుపీల్చిగూల్చితి । వేతన్మాత్రుడవెనీవౌ వేం ॥ ౨౯ ॥ సకుటిలుడైకంసప్రే । రకుడైజనుడెంచు నట్టిరకన్సురోష । ప్రకటుండగుశకటున్సుర । వికటున్ బడదన్నితౌరవేం॥ ౩౦॥ పా త్తిటిలోనినుయె త్తివి। యత్తల మునకెగయునిర్జరారిన్నహదో। న్మత్తుద్తృణావర్తున్దు।ర్వృ త్తుంబడకన్నిగూల్చితౌర వేం ॥ ౩౧ ॥ కన్నెఱ్ఱజేసిపొరు గుల । కన్నాజనకనియశోదయదలించుననీ । ఛన్నెల్ గనినన్నల్విని । వెన్నల్దినితంచునిన్ను వేం ॥ ౩౨ ॥ పెద్దయురోలీడ్చినతరి । మద్దులుపడగూల్చనందుమందంనీ పై । సుద్దుల్నీముద్దుల్నీ। విద్దెల్దలపోతురెపుడువేం॥ * బకునింభీతిదగోపా। ర్భకునన్గంసాసురప్రబలకార్యకరో। త్సుకునిన్ద్రుంచిసురలని । ర్వికలులజేసితివిగాదవేం॥౩౪॥ చూడగభయమగువనశిఖి । కోడినగోపాలజనులగోవులభీ తుల్ । వీడగమతివేడగనతి । వేడిగబళనంబుసేయువేం ॥ బెడిదంబగువిషశిఖిలో।బడిలోకులహడియజేయుఫణిఫణన త్వం। బెడలగమదినడలగనది । వెడలగజేసితివినటనవేం॥ రాలజడిరాలగావడి । నాలంగోపకులనింద్రుడలయి చెటు న। వ్వేళన్నీవేలంనీ। వ్రేలన్గిరినె త్తితౌర వేం॥౩౭ ॥ కుఱ్ఱ లతొ జ్జలదాచిన।బొజ్జవసిడివేల్పుమాయబొలియించితివౌ। తత్తలకున్వత్సలకున్ । వెజ్జులకలవెనినుదెలియవేం॥ సుతులన్నిజహితులన్దమ । పతులన్విడనాడిగోపవణతు లువేణు । శ్రుతిరతలైవిస్మృతిసం। వృతలైమిముదవులరా రెవేం ॥ ౩౯ ॥ తలపులునిచ్చలముగగొన । వలహలసుత గొలువనేగివనములగృంకే । బెలువలగనివలువలుగొని.

వెలిశెవడలినళజ్జగొనవె వేం॥ ౪౦ ॥ ఇరుపక్క్రియలక్షీవై। యిరువురుగోపికలనడుమ నెలమిస్నివై । చరియించురాస కేళీ । విరతికిసురలరుదుపడ రె వేం ॥ ౪౧ ॥ బోధితరతి సాధనమతి । శోధనయగురాధగూడిసుఖ మొందిననీ । గాథల్ దలపోయగనా। వేధఃప్రభృతులకుదర మె వేం॥ ౪౨॥ * లీలావన కేళీగృహ । ఖేలారతిసురతవృత్తిగృప నేలితివా । స్త్రీలక్ష్ లీలక్ష్ పదియా । ర్వేలక్షవై చిత్రగతుల వేం ॥౪౩॥ ధీరుడవై బలుతోజని। భూరిబలగరిష్ఠుడైనముష్టికునిక్షా। ణూరుక్షఘనశూరుక్షరిపువీరుక్షబడ మోదితౌర వేం॥౪౪॥ శ్రీసౌగంధిగ్రహణవి। లాసముచేకుబ్జవక్రలక్షణరహితక్ష। జేసితదభీష్ట మొసగితి । వేసరసత్వంబు నెరపి వేం ॥ ౪౫॥ గొల్లడవై పిల్లడవై । యల్లుడవై గంసుద్రుంచియతనిజనకుక్ష । దెల్లముగగాచినావని । వెల్లివిరిసెనీదుగీర్తి వేం॥ శ్రుతులభంగించినఖల। ధాత్రిజనుల్ బొగడదగువిదర్భావనిరా । ట్సుతిక్షశుభగాత్రిక్షనుప । వితిక్ష బెండ్లాడితౌ వేం ॥ ౪౬ ॥ సంబరమునబెండ్లాడవే । జాంబవతిన్మాన్యరత్నజాంబూనదభూ । షాంబరశృంగారవతిక్ష । బింబఫలసమాధరోష్ఠి వేం ॥౪౭॥ సత్యముగనిసత్రాజితు । డత్యుత్సుకుడై తనూజనర్పించినయా । సత్యక్షశుభకృత్యంసుఖ । వృత్యంగజకేళిగలయు వేం॥ ౪౮ ॥ ఇందునిభసుందర్శాస్యక । ళిందజనతమూనిబృందవికచకుచసమా । కందక్షగుణబృందక్షయర। విందాననబెండ్లిగావె వేం॥ ౫౦॥ ఋక్షాధిపనిభముఖకమ । లేక్షణహర్యక్షమధ్యనిభరా ఙ్గమునక్ష । లక్షణసువిలక్షణశుభ । వీక్షణబరిణయముగా

వె వేం॥ ౫౧ ॥ లగ్నముశుభముగ చేకొని । భగ్నంబుగ
గోవృషములబంధించితగన్ । నాగ్నజితిన్ బెండ్లాడవె ।
విఘ్నము దొరలంగనీక వేం ॥ ౫౨ ॥ భద్రస్థితిబెండ్లాడవె ।
మద్రమహీనాథుపుత్రిమానితగాత్రిన్ । భద్రన్నతుఁద్రన్న
వ । విద్రుమబింబాధరోష్ఠి వేం ॥ ౫౩ ॥ అందంబునబెం
డ్లాడవె । విందునిసుతమిత్రవిందవిలసితకచభా । కందర్
గుణబృందన్ యర । విందాననసురలుమెచ్చ వేం॥ ౫౪॥ న
రకునిచేచరమానిచి।పరుగూలిచిరాజసతులపాలించినభ।శ్వ
రులకుభూవరులకువా। విరిమెచ్చఘటించితౌర వేం॥౫౫॥*

* దశావతారపద్యములు. *

మత్స్యమవై పాథోనిధి । జొచ్చిపగతుంద్రచ్చితంమిచూలివి
చదువుల్ । దెచ్చితివిరయిచ్చితివిర। విచ్చలవిడినీదుగరుణ
వేం ॥ ౫౬ ॥ లీలన్ మందరగిరిచే । పాలకడలియసురబి
విజపజ్జీదరుచునవ్వేలన్ । నీవేలన్ దాబేలైనిలచితివిగ్రిం
ద వేం॥ ౫౭ ॥ కిరివైనతహరివైహిత । కరివైధరనుద్ధరిం
చికనకాక్షుండన్ ।సురవైరిన్నెరకోరన్। పెరవారంగీర్తి
తౌర వేం॥ ౫౮॥ నరహరిరూపముదాలిచి । పరునేపణగిం
చివిగతబహుతరఖేదున్ । పరముపిదున్ బ్రహ్లాదున్ । షెర
వారశిశాచితౌర వేం॥ ౫౯ ॥ అడుగులుమూడడిగిబలిన్।
నడుగుతలంబంటశిరమునందడుగిడివం । దడుగుభువిన్ గాన.
డుగుదివిన్ । విడిదలగాజేసితౌర వేం ॥ ౬౦ ॥ గొడ్డలి
చేదొడ్డరిపుల । జడ్డిగముల్ నరికిదివికిసరినేర్పడగా । నె
డ్డితివిభృగుమునీంద్రుని । బిడ్డడవైఖ్యాతిగన్న వేం ॥ ౬౧॥
సవనావనముభవధనుః । ప్రవిఖండనమువనిజాతపరిణయము.

మోతా । ర్ణవబంధనపరిహరమును । వివిధక్రియ సేయు రా
మ వేం ॥ ౬౨ ॥ చలమున నిశ్చలమున రిపు । బలమున శిం
వంగ జేయ బ్రహ్మాదుల్ నీకా । హలియంచు ముసలియంచును।
విలసించిను తెంచి రౌర వేం ॥ ౬౩ ॥ సద్ధర్మవ్రతము బ్బైడ।
బుద్ధమతులదనుజసతులభ్రష్టయించినయా । బుద్ధుడవతి
శుద్ధుడవభి । వృద్ధితగుణశాలివైన వేం ॥ ౬౪ ॥ తురగా
రూఢుడవై భూ । భరమణచగసజ్జనాళిపాలించగసం। కర
కులముకా పరబలముకా। విరివార్చగ గలికిజవైన వేం॥౬౫॥ *

* రామాయణకథానుగుణ్యములైనపద్యములు. *

దశముఖుచేవ్యథగలిగిద్రి । దశముఖులాగిదీనదశలదగి
మిము వేడకా । దశరథసుతుడవు గావా । విశదంబుగ
సురలగావ వేంకటరమణా ॥ ౬౬ ॥ మునిసవనావన
ముకొరకు । వనమునకనుజన్మయుతుడవై ముని వెంటకా జని
తాటకినిశౌటుని । వినయమ్మునద్రుంచితౌర వేంకటరమ
ణా ॥ ౬౭ ॥ కౌశికుడతికౌశలమతి । దేశికుడై యొసగ
సకలదివ్యాస్త్రంబుల్ । వాశిగ గైకొనవేప్ర । ధ్వీశకులీన
ప్రధాన వేం ॥ ౬౮ ॥ రాతినిసతిరీతినినతి । బ్రీతినిగావించి
ఋషులపెంపొందితివా । గౌతమమునిచేతకా । నుర్వీతలప
తులరుదు జెంద వేం ॥ ౬౯ ॥ భూపతులుద్దీపితులై । యేపు
న నే తెంచి యెత్తనెక్కిడనైనకా । నోపనిశివుచాపమునీ । వే
పగిదినిద్రుంచితౌర వేం ॥ ౭౦ ॥ సీతనుధరణీతలసం । జా
తను చేకొనినిజానుజాతులకుశుభో। పేతలగుసతులగూర్చితి।
వేతగ కల్యాణమెసగ వేం ॥ ౭౧॥ పరశువుగొనిపరశివువిలు।
విరచితివనియలుక బూని వెరపించెడుభూ । సురవర్యునిబిరు

సనసే । వెరవునభంజించితౌర వేం ॥ ౭౨ ॥ కైకవరమః
కైకానల । కేకమతికాసతియుతమ్ముడే తేరపురికా । లోం
కులరాకలుడుగనీ । వేకరణికామరపితౌర వేం ॥ ౭౩ ॥
నారలుచీరలుతులసీ । పేరులుహారములుగాగ పెంపలరజ
టా । భారములుదాల్చిశ్రీరఘు । వీరుండనుమాని వైన
వేం ॥ ౭౪ ॥ గుహుచేనుతిగాంచినహా । గుహుభారద్వా
జుచేసమాదరణుడవై । గుహించిత్రకూటగిరివన । విహార
ణవిశ్రాంతిగన్న వేం ॥ ౭౫ ॥ శోకమురక్తాంచితకుచ ।
కోకముగలధరణిజాతకోపముడుగగా । గాకీలబలుగాకీ
నవి । వేకీమదమణచితౌర వేం ॥ ౭౬ ॥ భరతుడుభూ
భరణముదు । ర్భరమనిమిము వేడుకున్న పాదుకలన్నిగ్గరమౌ
నీంద్రాదులుని । వ్వైరగొందనొసంగితౌర వేం ॥ ౭౭ ॥ ఉ
పమకాబొలియించితివౌ । నపరాధున్నిహతసాధునమరవి
రోధుకా । కపటక్రోధువిరాధుని । విపులంబగుశిగముద్రుం
చి వేం ॥ ౭౮ ॥ నందితశరభంగునిముది । సందర్శించియుసు
తీక్ష్ణసంయమిముఖ్యుల్ । డెందములానందవడగ । విందవు
గామెలగితౌర వేం ॥ ౭౯ ॥ కలశంబునవెలసినముని ।
వలశినతూణీరబాణవరములనగని । శ్చలమతిగొనిపంచ
వటుని । విలసించివసించితౌర వేం ॥ ౮౦ ॥ చక్కదనము వె
క్కిరిడుచు । కక్కసిజనకజనుగదియగని సౌమిత్రి । న్నకక్క
సిరక్కసిముక్కుచ్చి వెక్కసమున జెక్కుమన వేం ॥ ౮౧ ॥
వంటరివై ఖరముఖసుర । కంటకులీరెడువెలఘునరధులన
నికా । గొంటుటనీవంటిబలువా । వింటనెళవ్రేదెవియ్యరా ।
వేం ॥ ౮౨ ॥ సుగ్రీవునితోహితమే । కగ్రీవముగానొనర్చి

౯. జించితిన్నా । నిగ్రహతదానవాలికా విగ్రహబలశౌర్యవాలి ౧ ॥ ౮౩ ॥ కిష్కింధకుదానవకుల । శుష్కేంధనకీలి యైనసుగ్రీవుగ్రృవకా । బుష్కరపాత్రమ్రాజ్యరమా । విష్కరునిజేసితౌరవేం ॥ ౮౪ ॥ సంపాతిసెప్పభవదను । కంపాతిశయమ్మకలిమికడలిగడచియా । శంపాభసీతగనితన । పెంపలరగహనుమరాడెవేం ॥ ౮౫ ॥ బంధురగిరికంధరముల । సింధువుబంధించిరాత్రిసేంద్రానుజుని । గ్గంధుపిభీషణునరిగ । ర్వాంధనశిఖిబ్రోచితౌరవేం ॥ ౮౬ ॥ కపులాపోరగనిర్జరరిపులాదటబొదువచిత్రరేఖదునుమథా । త్రిపులానాపులానీ । విపులాంచత్కరుణగాకవేం ॥ ౮౭ ॥ మాయనెమ్మలగెడురావణి । మాయకాస్వామిత్రిదివ్యమార్గణమనల । చ్ఛాయకానరివోయకాదెగవెయకాబనిచితివిగాదెవేం ॥ ౮౮ ॥ తెరుగుటశరమరుగుటధర । దొరుగుటతరిపెరుగుటయును దోకపయుండకా । యరిశిరములుతెరతెరలుగ । బిరబిరనరికితివిగాదెవేం ॥ ౮౯ ॥ పరుగనిఘెరుపెరుగని । బలు । మరుగనిగురిగొనియపారమహిమసురగణం । బెరుగకాసుధగరుగకాశిఖి । బెరుగకాశరమేసితౌరవేం ॥ ౯౦ ॥ విధిపూర్వసమంత్రకముగ । విధుశరమరిబోసితీసివేసిదశముఖుకా । విధుశేఖరుడురుదందెడు । విధమునవధియించితౌరవేం ॥ ౯౧ ॥ నరులుకాకింనరులుకావా । నరులుకాభూసురలుసురలునౌనన వైశ్యా । నరుచేతనవనిజాతకా । విరివొందబరిగ్రహించువేం ॥ ౯౨ ॥ లంకారాజ్యముసుగుణా । లంకారిపిభీషణుండులక్షణముగనే । లంకరుణనొసగితివిసీ । వింకెవ్వరునీకుపాటి వేం ॥ ౯౩ ॥ భరతుండుమహానందా । భిర

తుండైయుండగరుణఁజెంపలరగయా । కరువలిసుతుబవ
వెనీ । వెరవుకుశలవార్తదెలుప వేం ॥ ౯౪ ॥ నందిగ్రామగము
ముంబునకా । నందంబునజనిజటాజినాంబరవేషం। బందు గో
విసర్జించితివిభు । విందగుజనులునుతిసేయవేం ॥ ౯౫ ॥ ॥
మాతలతోభ్రాతలతో । భూతలపతులతోమహావిభూతిచె రజ
నరసా । కేతపురిబ్రవేశించవె । వీతార్తిసురల్నుతించ న
వేం ॥ ౯౬ ॥ గంగాదినదీజీవన । సంగతగాంగేయక
లశచయములునీకై । పొంగిప్లవంగులుదేరెభు । వింగల ర
సురలభినుతింపవేం ॥ ౯౭ ॥ కనకమణిఖచితసింహాసనము ।
నపట్టాభిషేకసమయోత్సవమిం । పెనయచెలువందితేకా
నక । వినుతింపుచుసురలుమెచ్చవేం ॥ ౯౮ ॥ శిష్టవసిష్ఠ
ప్రాదిముని। శ్రేష్ఠులుగంగాజలాభిషేకమునిగమా। దిష్టవిధి
నొనర్చిరిగద్రి । విష్టపులునుతించనీకు వేం ॥ ౯౯ ॥ ముత్తి
యములగుత్తులదలు । కొత్తెదు వెలిగొడుగుభరతుడొగిదా
లిచిలో । హత్తినబలుబత్తికాసుఖ । వృత్తికానినుగొలిచె
గాదె వేం ॥ ౧౦౦ ॥ చామరలక్ష్మణనిజమృదుకర । తామ
రలజ్జబూనికవలుదారతగొలువం । గామదివేడుకగాను ।
ద్వీమండలమేలితౌర వేం ॥ ౧౦౧ ॥ అంజలియగునంజని
సుతు । మంజులవాక్పుంజనియతిమన్నించిమనో । రంజన
మగుతత్వముసర । వించెప్పదొడంగితౌర వేం ॥ ౧౦౨ ॥
ఇనజుడుదనుజుడుతారా। తనయుడుభల్లూకవిభుడుదగ్నన ల్ల
డలౌ।యనిలదిశౌధిస్థితులై। వినమితులైగొలువరారే వేం।
కుశలాగ్రగుణారాధ్యుల । కుశలవులనుసుతులబడసిసురు
తరమగునీ । యశముదిశలందునించవె । విశదంబుగజగ